## భారత స్వాతంత్ర్యోద్యమం

# ముస్లింలు

సయ్యద్ నశీర్ అహమ్మద్

M.Com; LL.B; D.J; D.P.M; D.L.L

Sahithya Rathna ( Hindi )

## ఇందులో.....



**అబ్బాదుల్లా**
డైరెక్టర్
తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్
సందేశభవనం, లక్కడ్‌కోట్
ఛత్తాబజార్, హైదరాబాద్-2

# ప్రచురణకర్త పలుకులు

ప్రముఖ రచయిత శ్రీ సయ్యద్ నశీర్ అహ్మద్‌గారు రచించిన **'భారత స్వాతంత్ర్యోద్యమం-ముస్లింలు'** అను ఈ పుస్తకం స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింలు నిర్వహించిన పాత్రకు అద్దం పడుతుంది. చరిత్ర పరిశోధకుడు నశీర్ అహ్మద్ రాసిన ఈ పుస్తకం భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింల పాత్రను అవగాహన చేసుకోవడానికి ఎంతగానో సహకరిస్తుంది.

ఈ పుస్తకం తొలుత **'ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్'** ద్వారా 1999లో ప్రచురితమైంది. ఆ సందర్భంగా లభించిన పాఠకాదరణ వలన 2003లో పునర్ముద్రణ అయ్యింది. భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింలు నిర్వహించిన పాత్ర గురించి తెలుగులో ప్రత్యేకంగా పుస్తకం ఏమీ లేకపోవటంతో ఈ పుస్తకానికి పాఠకుల, పండితుల ఆదరణ విశేషంగా లభించింది. ఆ కారణంగా మరిన్ని మార్పులు చేర్పులతో, అమూల్యమైన పలు చిత్రాలు సమకూర్చుకుని మూడవసారి ముచ్చటగా ప్రస్తుతం మీ ముందుకు వచ్చింది.

శతాబ్ధాలుగా మన దేశంలో కలసిమెలసి సహజీవం సాగిస్తున్న వివిధ సాంఘిక జన సముదాయాలు తమ తమ పూర్వీకులు మాతృదేశ విముక్తి కోసం, ఆ తరువాత స్వంతగడ్డ ప్రగతి కోసం చేసిన త్యాగాలను, సాగించిన కృషిని పరస్పరం తెలుసుకుంటే, ఒకరి పట్ల మరొకరికి గౌరవభావం ఏర్పడుతుంది. ఆ గౌరభావం నుండి ఆయా సముదాయాల పట్ల సదవగాహన, సధ్భావన పరిఢవిల్లుతాయి. ఆ సద్భావన నుండి సహిష్ణుత ఉద్భవిస్తుంది. ఆ కారణంగా మత సామరస్యం మరింత పటిష్టం కాగలదని ఆశిస్తూ...

**- అబ్బాదుల్లా**



# వావిలాల శుభాశీస్సులు



**భారత స్వాతంత్ర్యోద్యమం: ముస్లింలు** చిత్తుప్రతి అందినది. చదివాను. స్వాతంత్ర్యోద్యమంలో ముస్లిం సమాజం నిర్వహించిన పాత్రను, ఆనాటి సంఘటనలను, ఆయా ఘట్టాలలో పాల్గొన్న యోధుల వివరాలను సంక్షిప్తంగా వివరించారు. ఆనాటి త్యాగధనుల చరిత్రలను విస్తృతంగా ప్రచారం చేయాల్సిన అవసరం ఈనాడు ఎక్కువగా కన్పిస్తుంది. ఆ ప్రయత్నంలో భాగంగా మీరు సాగిస్తూన్న కృషి నిజంగా అభినందనీయం. ఈ చిన్న పుస్తకం అతిపెద్ద బాధ్యతను నెరవేర్చుతూ చరిత్రలో నిలిచిపోగలదు. మీకు నా శుభాశీస్సులు.

ఇట్లు

**18-8-1999**

**గుంటూరు**

శ్రీ వావిలా గోపాలకృష్ణ





# నా మాట...

భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింల పాత్రను ప్రజలకు తెలుపాలన్న ఉద్దేశ్యంతో 1999లో **భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లింలు** సుదీర్ఘ వ్యాసం రాశాను. ఆ వ్యాసం **గీటురాయి** వారపత్రికలో ధారావాహికంగా ప్రచురితమైంది. ఈ వ్యాసం, **ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్** ఛైర్మన్, హాజీ షేక్ పీర్ అహమ్మద్ గారి ప్రోత్సాహంతో పుస్తక రూపం తీసుకుంది. అప్పటికి నాకు అందుబాటులో ఉన్న సమాచారం,చిత్రాలతో **భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లింలు** ప్రచురితమైంది. ఈ చిన్న పుస్తకాన్ని పెద్ద మనస్సుతో పాఠకులు ఆదరించారు. పత్రికలు చక్కని సమీక్షలతో ప్రజలకు పరిచయం చేశాయి.

ఆ తరువాత 2003 ఆగస్టులో మంగళగిరికి చెందిన **తక్షశిల ప్రచురణలు** అధినేత రేఖా కృష్ణార్జునరావు గారు, ఈ పుస్తకాన్ని యథాతథంగా పునర్ముద్రించారు. భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింల మహోన్నత పాత్రను పదిమందికి తెలిపి, ప్రజలలో సద్భావన-సదవగాహన ఏర్పర్చాలన్న ఉద్దేశ్యంతో ఈ పుస్తకాన్ని చాలా వరకు ఉచితంగా పంపిణి చేయించి తన మంచి మనస్సును చాటుకున్నారు.

ప్రస్తుతం **తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్** సంచాలకులు జనాబ్ అబ్బాదుల్లా ఆనాటి పుస్తకాన్ని సరికొత్తగా ప్రచురించదలిచారు. అందుకు నూతన సమాచారం, నూతన చిత్రాలు, ఫోటోలు సమకూర్చాలని ముందస్తు షరతు విధించారు. ఆ షరతును అనుసరిస్తూ, చరిత్ర ఆధ్యాపకులు, పరిశోధకులు, పాఠకుల సూచనలను వీలయినంతగా పాటిస్తూ, ప్రస్తుతం మీ చేతుల్లో ఉన్న పుస్తకాన్ని తిరగరాశాను. ఈ పుస్తకంలోని సమాచారాన్ని తొలినాటి పుస్తకంతో పొల్చినట్టయితే నూతన సమాచారం, నూతన చిత్రాలు, ఫోటోల కారణంగా పరిమాణంలో ద్విగణీకృతమై సరికొత్త పుస్తకమయ్యింది.

ఈ కృషిలో నాకు సహకారం అందించిన తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్, సంచాలకులు **జనాబ్ అబ్బాదుల్లా** గారికి, పరిచయ వాక్యం రాసిచ్చిన స్వాతంత్ర్య సమరయోధులు, విశాలాంధ్ర దిన పత్రిక విశ్రాంత సంపాదకులు శ్రీ పరకాల పట్టాభిరామారావు గారికి మిత్రులు **జనాబ్ వాహెద్** (గీటురాయి) గారికి, చక్కని చిత్రాలు గీసిచ్చిన ప్రముఖ చిత్రకారులు షేక్ అబ్దుల్లా (విజయవాడ) గారికి, నా ప్రతి ప్రయత్నం వెనుక తానుండి సతతం నన్ను ప్రోత్సహిస్తున్న నా జీవిత భాగస్వామి **శ్రీమతి రమిజా** బానుకు, నా ప్రత్యేక ధన్యవాదాలు.

ఇక ఈ గ్రంథం గురించి తీర్పు చెప్పాల్సింది పాఠకులే !

**- సయ్యద్ నశీర్ అహమ్మద్,**
**వినుకొండ, ఏప్రిల్ 2006.**



**పరకాల పట్టాభిరామారావు,**
స్వాతంత్ర సమరయోధులు,
**విశాలాంధ్ర** దినపత్రిక విశ్రాంత సంపాదకులు
విజయవాడ, ఫోన్:0866-2474635

**పరిచయ వాక్యం**

# పరకాల పరిచయ వాక్యం

**'భారత స్వాతంత్ర్యోద్యమం: ముస్లింలు'** గ్రంథాన్ని శ్రీ సయ్యద్ నశీర్ అహమ్మద్ వ్రాయకపోతే భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింలు నిర్వహించిన వీరోచిత పాత్ర, కొత్తతరం వారికే కాదు, పాత తరం వారిలో చాలా మందికి కూడా తెలియకుండా పోతుందనే చెప్పుకోవాలి. ఈ గ్రంథంలో భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రను విహంగ దృష్టితో వీక్షిస్తూ, అందులోని ప్రధాన ఘట్టాలలో ముస్లిం స్వాతంత్ర్య సమరయోధుల పాత్రను సోదాహరణంగా రచయిత తెలియజేశారు.

1765 ప్రాంతంలో బ్రిటీష్ పాలకుల మీద తొలి తిరుగుబాటు జెండాను ఎగురవేసిన ముస్లిం ఫకీరులు- హిందూ సన్యాసుల సాయుధ పోరాటంతో ప్రారంభించి, వలసపాలకుల జోహుకూందారులుగా వ్యవహరిస్తున్న జమీందారులను, మహజనులు అనబడు వడ్డీ వ్యాపారులను ఎదుర్కొన్న ఫరాజీ యోధుల తిరుగుబాట్లను, వహాబీ వీరుల పోరాటాలను, మలబారు మోప్లాలు సాగించిన అత్మార్పణల విశిష్ట ఉద్యమాలకు సంబంధించిన చాలా అరుదైన సమాచారాన్ని ఈ గ్రంథం అందిస్తుంది. ఆ పోరాటాల అపూర్వ చరిత్రను రచయిత ఉత్తేజపూర్వకంగా వివరించారు. ఆనాటి నుండి పరాయి పాలకుల మీద యుద్ధం ప్రకటించిన యోధుల చరిత్ర క్రమంలో టిపూసుల్తాన్ పాత్రను ప్రవేశపెడుతూ, విదేశీ శత్రువుతో పోరాడుతూ రణభూమిలో వీరమరణం పొందిన స్వదేశీ రాజులలో ఆయన ప్రథముడని రచయిత తెలిపారు.

1857 నాటి చారిత్రక పోరాటంలో అద్వితీయ పాత్ర పోషించిన ముస్లింల సాహసాలను, ఆ దశలో అరివీర భయంకరంగా పోరాడిన పలువురు యోధుల గురించే కాకుండా యోధరాండ్ర గురించి అమూల్య సమాచారం ఈ పుస్తకంలో లభిస్తుంది. ఆనాటి పోరాట యోధుల వీరోచిత గాథలు హృదయాలను కదల్చివేస్తాయి. చరిత్ర పుటలలో మరుగునపడిన ఈ ఘట్టాలు రచయిత ఎంతో శ్రమించి అన్వేషిస్తేగాని లభించే అవకాశం లేదు. ఈ పోరాటంలో భాగం పంచుకున్న పాత్రికేయుల ఘన చరిత్రను కూడా స్వయంగా జర్నలిస్టు అయిన నశీర్ వదలి పెట్టలేదు. కంపెనీ పాలకుల దుశ్చర్యలను దుయ్యబడుతూ, తిరుగుబాటును ప్రోత్సహిస్తూ కలంతో రణం చేసి, జనరల్ హడ్సన్ తుపాకి గుండ్లకు బలైన 'ఢిల్లీ అక్బార్' సంపాదకుడు మౌల్వీ మహమ్మద్ బాకర్ గురించి సరికొత్త సమాచారాన్ని అందించారు. ఆయన బాటలో నడిచిన నిజాం రజాకారుల కరకు కత్తులకు బలైన, తెలుగు బిడ్డడు షోయాబుల్లా ఖాన్‌ను మన కళ్ళ ముందు సాక్షాత్కరింప చేస్తారు. ప్రథమ స్వాతంత్ర్య సమరంలో బ్రిటీష్ పాలకుల రికార్డులను బట్టే 27 వేల మంది ముస్లింలు ఊచకోతకు గురయ్యారన్న సమాచారం చదువుతుంటే కళ్ళనీళ్ళు తిరగకమానవు. ఈ పోరాటంలో వ్యక్తమైన హిందూ-ముస్లింల ఐక్యతను విచ్ఛిన్నం చేసేందుకు వలసపాలకులు ప్రజలను మత ప్రాతిపదికన విభజించి, చరిత్రను వక్రీకరించి రాసి, మత మనోభావాలను రంగం మీదకు తెచ్చి, విభజనకు బీజాలు నాటారని రచయిత వివరిస్తారు.

1885లో భారత జాతీయ కాంగ్రెస్ అవిర్భావం నుండి స్వాతంత్ర్యం సిద్ధించేంత వరకు ఈ గడ్డ బిడ్డలైన ముస్లిం జనసముదాయాల భాగస్వామ్యాన్ని, అందులో విశిష్ట భూమిక నిర్వహించిన త్యాగధనుల విశేషాలను పాఠకులకు పరిచయం చేస్తూందీ గ్రంథం. సామాన్య పాఠ్య గ్రంథాలు గాని, అందుబాటులో ఉన్న చరిత్ర గ్రంథాలలో గాని మనకు లభ్యంగాని అరుదైన సాహస ఘట్టాలను మన ముందు దృశ్యీకరించి పాఠకుడ్ని తన వెంట తిప్పుకుంటూ, అలనాటి స్వాతంత్ర్య సమరయోధులందర్ని పరిచయం చేయటంలో రచయిత విజయం సాధించారు.

జాతీయ కాంగ్రెస్ స్థాపనలో, విస్తరణలో సహకరించిన బద్రుద్దీన్ తయ్యాబ్జీ, రహిమతుల్లా సయాని నుంచి, '... నమాజ్ నాకు ఎంతటి విధి అయిందో, నా దేశ

స్వాతంత్ర్యం కోసం పోరాడటం అంతే తప్పనిసరి విధి...' అంటూ పోరుబాటన నడిచిన ఉలేమాల ప్రతినిధి మౌలానా అహమ్మద్, అగ్నియుగంగా ఖ్యాతిగాంచిన విప్లవోద్యమంలో పాల్గొని దశాబ్దాల తరబడి ప్రవాస జీవితాలను గడపటమే కాకుండా ప్రప్రథమ ప్రవాస భారత ప్రభుత్వ ప్రధానిగా బాధ్యతలు నిర్వహించిన ప్రొఫెసర్ బర్కతుల్లా భోపాలి, యుగాంతర్ గ్రూపుకు చెందిన విప్లవకారుడు ఖుదీరాంకు ఆశ్రయం కల్పించి 'ఖుదీరాంకి దీది'గా ఖ్యాతిగాంచిన అజ్ఞాన యువతి, ఉరి కొయ్యలకు వెరవని అసమాన ధైర్యవంతులు రసూలుల్లా ఖాన్, ఇంతియాజ్, భగత్ సింగ్‌కు ఆదర్శప్రాయుడు, హిందూ-ముస్లింల ఐక్యతా చిహ్నం అష్ఫాఖుల్లా ఖాన్ లాంటి అరుదైన విప్లవ వీర కిశోరాలు ఈ గ్రంథంలో పాఠకుడికి తారసపడతారు.

జాతీయోద్యమంలో భాగంగా సాగిన ఖిలాఫత్ పోరాటంలో ముందుకు నడిచిన అలీ సోదరులు, స్వాతంత్ర్యం కంటే హిందూ-ముస్లింల ఐక్యత ప్రధానమన్న మౌలానా అబుల్ కలాం అజాద్, బ్రిటీష్ పోలీసుల క్రౌర్యాన్ని పళ్ళబిగువున భరించి తొలిసారిగా సంపూర్ణ స్వరాజ్యం డిమాండ్ చేసిన కమ్యూనిస్టు యోధుడు మౌలానా హస్రత్ మోహాని, జలియన్‌వాలాబాగ్ వీరుడిగా ఖ్యాతిగాంచిన డాక్టర్ సైఫుద్దీన్ కిచ్లూ, విముక్తి పోరాటంలో విలాసాలకు తావు ఉండరాదంటూ సర్వస్వం ఉద్యమాలకు సమర్పించటమే కాకుండా గాంధీజీ దేశ పర్యటనకు నిధులు అందచేసిన వృద్ధ మాత 'బీబి అమ్మ'గా చిరస్మరణీయురాలైన అబాది బానో బేగం, నిషాతున్నిసా బేగం లాంటి పలు మహిళా రత్నాలు, 'క్విట్ ఇండియా' నినాదం సృష్టించిన యూసుఫ్ మోహరాలి, వందలాది విముక్తి పోరాట యోధులు తమ తమ విశిష్టమైన భూమికలతో దర్శనమిస్తారు. స్వరాజ్య సాధన మాత్రమే కాకుండా కార్మిక- కర్షక సంక్షేమం కోరుకుంటూ ఆ దిశగా కూడా సాగి పలు కుట్ర కేసులను ఎదుర్కొన్న షౌకత్ ఉస్మాని, ముజఫర్ అహమ్మద్, కవులు ఖాజీ నజ్రుల్ ఇస్లాం, సజ్జాద్ జహీర్, హజరా బేగం లాంటి కమ్యూనిస్టు ఉద్యమకారుల సమాచారం ఉంది.

నేతాజీ నాయకత్వంలో ప్రాణాలు తృణప్రాయంగా భావించి ఆజాద్ హింద్ ఫౌజ్‌లో ప్రముఖ పాత్ర వహించి, ' జైహింద్ ', ' నేతాజీ ' అను ప్రఖ్యాత పదాలను కాయిన్ చేసిన మన రాష్ట్రానికి చెందిన అబిద్ హసన్ సఫ్రాని, ఫౌజ్ సేనాని జనరల్ షానవాజ్ ఖాన్, నేతాజీ వెంట మృత్యువును స్వీకరించిన హబీబుర్ రెహమాన్ లాంటి

వీరపుత్రుల అరుదైన విశేషాలు ఈ గ్రంథంలో లభ్యమవుతాయి. నిరాయుధులుగా బ్రిటీష్ పోలీసు బలగాలకు ఎదురు నిలచి అహింసా మార్గంలో ఆత్మార్పణలతో వాయవ్య సరిహద్దు రాష్ట్రాన్ని ఎరుపెక్కించి, ప్రపంచ అహింసోద్యమాల చరిత్రలో అగ్రస్థానం పొందిన ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ 'ఖుదా-యే-ఖిద్మత్‌గార్' పఠాన్ బిడ్డలు కనపడతారు.

బ్రిటీషర్ల బానిసత్వం నుండి విముక్తి కోసం సుదీర్ఘకాలంపాటు సాగిన స్వాతంత్ర్య సమరంలోని ప్రతి ఘట్టంలో తమ భాగస్వామ్యాన్ని అందించిన ముస్లిం యోధుల పాత్రను సంగ్రహంగా అందించిన, ఈ గ్రంథాన్ని రచయిత క్రింది వాక్యాలతో ముగించటం సమంజసంగా ఉంది. దేశ విభజన సమయంలో '.. ముస్లిం సంపన్న...వర్గాలలో అత్యధికులు భారత్ వదలి వెళ్ళి పోయారు. కాని లౌకిక భారతంపై పరిపూర్ణ విశ్వాసంతో కోట్లాది ముస్లింలు యిక్కడే ఉండిపోయారు. మాతృదేశం అభివృద్ధి, రక్షణకు సంబంధించిన పలు రంగాలతోపాటు దేశ ప్రతిష్టను యినుమడింపజేసే అనేక జీవన రంగాలలో విశేషమైన కృషి సల్పుతూ భారతీయ సమాజంలో అవిభాజ్యమై పోయారు. మౌలానా అబుల్ కలాం ఆజాద్ మాటల్లో చెప్పాలంటే, ముస్లింలు లేని భారత చరిత్ర, సంస్కృతి, నాగరికత అసంపూర్ణం, అపరిపూర్ణం...'.

ఈ మాటలను అక్షరాల రుజుచేసేవిధంగా రచయిత సయ్యద్ నశీర్ అహమ్మద్ ఎంతో శ్రమకోర్చి, అపూర్వ పరిశోధన జరిపి, ఈ గ్రంథాన్ని ఒక అమూల్యమైన కానుకగా తెలుగువారికి అందచేశారు. భారత స్వాతంత్ర్య సమరం చరిత్రకు సమగ్ర రూపం కల్పించడానికి ఇంకా ఎంత కృషి జరగాల్సి ఉందో ఈ పుస్తకం గుర్తు చేస్తుంది. స్వాతంత్ర్యోద్యమ ఉజ్వల చరిత్రలో ముస్లింల పాత్ర గురించి గతంలోను, వర్తమానంలోను, భవిష్యత్తులోను పరిశోధన జరిపిన, జరుపుతున్న వారందరికీ ఈ గ్రంథం అమూల్యమైన ఆధారం కాగలదు. అంతటి మంచి పరిశోధనాత్మక పుస్తకాన్ని అంద చేసినందుకు స్వాతంత్ర్య సమరయోధుల అందరి పక్షాన, పరిశోధకుల తరఫున రచయిత శ్రీ నశీర్ అహమ్మద్‌ను అభినందిస్తున్నాను.



# భారత స్వాతంత్ర్యోద్యమం
# ముస్లింలు

భారతదేశ చరిత్రలో స్వాతంత్ర్యోద్యమం ఒక మహోజ్వల ఘట్టం. భారతీయుల పోరాటపటిమకు, త్యాగనిరతికి, నిరుపమాన దేశభక్తికి ఆ ఉద్యమం ఒక నిలువుటద్దం. దాదాపు ఒక శతాబ్దంపైగా సాగిన ఈ పోరాటాన్ని సుసంపన్నం చేసేందుకు జాతి, మత, కుల, ప్రాంతీయతలను విస్మరించి భారతీయులంతా ఏకోన్ముఖంగా ఆత్మార్పణలకు పోటీపడటం అపూర్వం. లక్షలాది ప్రజానీకం ఒకే నినాదం, ఒకే లక్ష్యం కోసం ఒకే బాటన ముందుకు సాగటం ప్రపంచ చరిత్రలోనే అరుదైన సంఘటన.

ఈ పోరాటానికి భారతదేశపు అతిపెద్ద అల్పసంఖ్యాకవర్గమైన ముస్లిం సమాజం తనదైన భాగస్వామ్యాన్ని అందించింది. ముస్లిమేతర సాంఘిక జన సమూహాలతో మమేకమై స్వాతంత్ర్యసమరంలో తన విద్యుక్త ధర్మాన్ని నిర్వర్తించింది. అపూర్వ త్యాగాలతో, అసమాన ఆత్మబలిదానాలతో భారతీయ ముస్లింలు పునీతులయ్యారు. అయినప్పటికీ ముస్లిం సమాజం త్యాగమయ చరిత్ర పలుకారణాల మూలంగా మరుగున పడిపోయింది. తమ పాలనను సుస్థిరం చేసుకునేందుకుగాను బ్రిటీష్ పాలకులు **విభజించు-పాలించు** కుటిల నీతిని అమలుపర్చి భారతీయులను హిందువులు-ముస్లింలుగా విభజించటంలో కృతకృత్యులయ్యారు.

భారత విభజనకు దారితీసిన పరిస్థితులు, ఆ తరువాత జరిగిన దారుణాలు,

పొరుగుదేశంగా ఏర్పడిన పాకిస్తాన్‌తో జరిగిన యుద్ధాలు, వివాదాలు స్వాతంత్ర్యోద్యమ కాలంనాటి హిందూ - ముస్లింల ఐక్యతకు చిచ్చుపెట్టాయి. భారత విభజనానంతర పరిణామాల వలన అపరాధ భావనకు గురిచేయబడిన ముస్లిం సమాజం సుషుప్తావస్థలోకి నిష్క్రమించింది. యుద్ధాలు, వివాదాలు, దేశంలో తరచుగా సాగిన మతకలహాలు మెజారిటీ, మైనారిటీ వర్గాల మధ్య మానసిక విభజనకు కారణ మయ్యాయి.

ప్రజల మత మనోభావాలను రెచ్చగొట్టి మతం పేరుతో మనుషులను చీల్చి, రాజకీయ ప్రయోజనాలను సాధించదలచిన మతోన్మాద రాజకీయశక్తులు, వ్యక్తులు ఈ చీలికను అగాధంగా మార్చాయి. పర్యవసానంగా బ్రిటీషర్ల బానిసత్వం నుండి మాతృ భూమిని విముక్తం చేసేందుకు సాగిన సుదీర్ఘ పోరాట చరిత్రలో ముస్లిం సమాజం త్యాగాలు మరుగునపడిపోయాయి.

## ప్రజలకు చేరువకాని సమాచారం

చరిత్ర గ్రంథాలలో ముస్లింలు చాలా వరకు కన్పించరు. ఒకరిద్దరు కన్పించినా అనన్య సామాన్యమైన వారి త్యాగాలు, సాధారణ స్థాయి వివరణలతో, వర్ణనలతో సరిపెట్టబడతాయి. ప్రాచుర్యంలో ఉన్న చరిత్ర గ్రంథాలలో ముస్లింల వీరోచిత గాధలు సరైన స్థానం పొందలేకపోయాయి. కనుక ఆయా కథనాలు సామాన్య చరిత్ర గ్రంథాలలోగాని, పాఠ్య పుస్తకాలలోగాని చోటు చేసుకోలేదు. ఫలితంగా భవిష్యత్తు తరాలకు అమూల్య సమాచారం అందకుండా పోయింది.

చరిత్ర ద్వారా తెలిగ్గా సమాచారం లభించే అవకాశం లేనందున, కళా రూపాలకు, సాహిత్య ప్రక్రియలకు, ప్రచార మాధ్యమాలకు ముస్లింల శ్లాఘనీయ చరిత్రలు కథా వస్తువు కాలేకపోయాయి. ఆ కారణంగా ముస్లింల త్యాగాలు, ఆనాటి వీరోచిత సంఘటనలు జనబాహుళ్యంలోకి వెళ్ళకపోవటంతో ఆ తరువాత తరాలకు ఆ విషయాలు అందలేదు. ఈ పరిణామాలే భారతదేశంలోని హిందూ-ముస్లిం జనసమూహాల మధ్య మానసిక ఎడం ఏర్పడటానికి ప్రధాన కారణమయ్యాయి.

ఈ మానసిక అగాథాన్ని మరింత పెంచి ఒక సాంఘిక జనసమూహానికి తామే ఏకైక ప్రతినిధులుగా ప్రకటించుకుని రాజ్యమేలాలని ఆశిస్తున్న శక్తులు-వ్యక్తులు ఈ అవకాశాన్ని వినియోగించుకుంటున్నాయి.

## త్యాగాల చరిత్ర అందరికీ తెలియాలి

ఈ పరిస్థితిని చక్కదిద్దాల్సిన అవసరం ఎంతో ఉంది. ప్రజలకు అన్ని సాంఘీక జనసముదాయాల త్యాగాలు తెలియాల్సి ఉంది. పలు సాంఘిక జనసముదాయాల గడ్డ అయినటుంటి భరతభూమిలో ఆయా జనసముదాయాల మధ్యన సుహృద్భావ వాతావరణం ఏర్పడడానికి ఒకరి గురించి మరొకరికి తెలియాల్సిన ఆవసరం ఎంతైనా ఉంది. మాతృభూమి సేవలో పునీతమైన ప్రజలందరి చరిత్ర తెలిసినప్పుడు మాత్రమే ఆయా జనసముదాయల మధ్యన పరస్పర గౌరవం ఏర్పడుతుంది. ఆ గౌరవం సదవగాహన, సధ్భావన, సహిష్ణుతకు పునాది అవుతుంది.

ఈ వాతావరణంలో మాత్రమే లౌకిక వ్యవస్థ పరిఢవిల్లుతుంది. మత విద్వేషాలు మట్టిలో కలసి మతసామరస్యం మరింతగా పటిష్టమౌతుంది. ఆ ప్రయత్నంలో భాగంగా సామాన్య ప్రజలకు చేరువకాని ముస్లింల త్యాగమయ చరిత్రను ప్రజల చెంతకు చేర్చేందుకు సాగుతున్న కృషిలో చిన్న ప్రయత్నమిది.

## స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో అరుణపుటల్ని తెరిచిన సిరాజుద్దౌలా

16వ శతాబ్ధంలో వర్తకం పేరుతో భారత గడ్డ మీద అడుగు పెట్టిన బ్రిటీషు వర్తకులు స్వదేశీ పాలకుల దరిచేరి ధనకనక వస్తు వాహనాలను కానుకలుగా సమర్పించి, ప్రలోభపెట్టి ఈ నేల మీద స్థిరపడటం ప్రారంభించారు. ఈ వర్తకుల రాకతో వ్యాపారం అభివృద్ధి చెందుతుందని ఆశించిన స్వదేశీ పాలకులు ఆంగ్లేయులకు అన్ని అవకాశాలు కల్పించారు. సరుకును నిల్వ చేసుకునేందుకు స్వంత గిడ్డంగులు కట్టుకుంటామని స్వదేశీపాలకుల ఎదుట సాగిలపడి అనుమతి సంపాదించుకున్నారు. ఆ అనుమతుల ఆధారంగా గిడ్డంగుల రక్షణ కోస మంటూ పటిష్టమైన కోటల నిర్మాణానికి పూను కున్నారు. మీరు వ్యాపారులు. మీకు కోటల అవసరం ఏముంది? నా రక్షణలో ఉన్నందున మీకు శత్రువు గురించి ఎటువంటి భయం అక్కరలేదు,


సిరాజుద్దౌలా

అని బెంగాలు నవాబు అల్లావర్ది ఖాన్ లాంటి స్వదేశీ పాలకులు హామీలు ఇచ్చినా, ఓ పథకం ప్రకారంగా గిడ్డంగుల నిర్మాణాలతో ప్రారంభమై, పటిష్టమైన కోటలు కట్టుకుంటూ, రాజ్యాధికారం కోసం ఆంగ్లేయులు స్వదేశీ పాలకుల వ్యవహారాలో జోక్యం చేసుకోవటం ఆరంభించారు. ఆ ప్రయత్నాలలో భాగంగా బెంగాలు మీద అధిపత్యం కోసం ఆరంభించిన ఎత్తులను ఆదిలోనే గ్రహించి, ఆ కుయుక్తులను వమ్ముచేసి, ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకుల పెత్తనాన్ని రూపుమాపేందుకు పాతికేళ్ళు దాటని యువకుడు బెంగాలు నవాబు సిరాజుద్దౌలా **'భారత స్వాతంత్ర్య సాయుధ సమరేతిహాసంలో అరుణపుటల్ని తెరిచాడు'**. భరతగడ్డ మీద తొలిసారిగా **'బ్రిటీష దుష్టులను కత్తిపట్టి ఎదిరించిన మొనగాడు'** గా ఖ్యాతిగాంచిన ఆయన ప్రఖ్యాత ప్లాసీ యుద్ధంలో క్లయివు నాయకత్వంలోని కంపెనీ సైన్యాలను ఎదుర్కొన్నారు.

ఈ యుద్ధంలో బెంగాలు సింహాసనం కోసం ఆశపడిన సర్వసేనాని మీర్ జాఫర్, అలవికానంత సంపదను సమకూర్చుకోవాలనుకున్న దురాశాపరులు ప్రముఖ బ్యాంకరు జగత్ సేథి, సంపన్న వ్యాపారి అమిచంద్, నవాబు దర్బారులోని మరోక ప్రముఖుడు రాయ్ దుర్లబ్, సేనానాయకుడు మానిక్ చాంద్, తదితరులు శత్రువుతో చేతులు కలిపి విశ్వాసఘాతుకానికి పాల్పడ్డారు. ఆ కారణంగా 1757లో ప్లాసీ అను గ్రామం వద్ద జరిగిన యుద్ధంలో 50వేల స్వదేశీ సైన్యం కలిగిన సిరాజుద్దౌలా మూడు వేల బ్రిటీషు సైన్యం చేతిలో పరాజితుడయ్యారు.

ఆ తరువాత సిరాజుద్దౌలా స్థాయిలో కాకున్నా, స్వదేశీయుల ప్రయోజనాలకు **భంగం కలిగిస్తున్న కంపెనీ పాలకుల** చర్యలను, ఆంగ్లేయుల పెత్తనాన్ని, ఏమాత్రం అంగీకరించని మరోక యోధుడిగా మీర్ ఖాశిం రంగం మీదకు వచ్చారు. స్వదేశీ పాలకుల సహకారంతో 1764లో బక్సర్ అనుచోట కంపెనీ బలగాల మీద మీర్ ఖాశిం విరుచుక పడ్డారు. ఈ యుద్ధంలో స్వదేశీ పాలకుల నుండి ఆశిం చినంత సహకారం లభించకపోవటం, స్వదేశీ సైనికుల కంటే, కంపెనీ సైన్యాలు చక్కని శిక్షణ కలిగియుటంతో మీర్ ఖాశింకు పరాజయం తప్పలేదు. 1757లో ప్లాసీ యుద్ధ విజయం


మీర్ ఖాశిం



**1765లో మొఘల్ పాదుషా 'షా ఆలం' బెంగాల్ దివానీని రాబర్ట్ క్లైవ్‌కు సంక్రమింపజేస్తున్న దృశ్యం**

**అందించిన అవకాశాన్ని ఉపయోగించుకుని** బక్సర్ **యుద్ధంలో సాధించిన విజయంతో ఆంగ్లేయులు** ఇండియాలో స్థిరపడగలిగారు.

ఈ క్రమంలో 1765 ప్రాంతంలో మొగల్ పాదుషా షా ఆలం నుండి బెంగాలు దివానిని స్వాధీనం చేసుకున్నారు. ఈ చర్యతో పాదుషాలు నామమాత్రమైపోగా, ఆంగ్లేయుల పెత్తనం ఇండియాను పూర్తిగా ఆక్రమించుకునే దిశగా సాగింది. అనుకోని విధంగా పెత్తనం చేతికి రావటంతో, గతంలో పాదుషాలు అనుసరించిన విధానాలకు అతీతంగా, లాభాల పంటలు పండించుకుని, ఈ గడ్డ మీద నుండి అందినంత దోచుకపోడానికి కంపెనీ అధికారులు, ఉద్యోగుల ఆవురావురంటూ దోపిడికి శ్రీకారం చుట్టారు. ఈ ఆకస్మిక పరిణామాలు కొనసాగుతున్న వ్యవస్థలో అనూహ్య మార్పులకు కారణమై, అన్ని వర్గాల ప్రజలను ప్రభావితం చేయటంతో ఆయా వర్గాలలో కలకలానికి కారణమైంది.

## ఫకీర్లు-సన్యాసుల సమైక్య పోరాటం

భారత దేశాన వర్తకులుగా అడుగిడిన బ్రిటీషర్లు అంది వచ్చిన ఆవకాశాలను ఉపయోగించుకుంటూ క్రమక్రమంగా తమ సామ్రాజ్య విస్తరణ కాంక్షకు స్వదేశీ పాలకులను ఎరచేయటం ఆరంభించారు. భారత భూభాగం మీద తమ పాలనను

సుస్థిరం చేసుకునేందుకు కుట్రలు కుయుక్తులకు శ్రీకారం చుట్టి కొండచిలువలా భరత గడ్డను చుట్టేయసాగారు. కంపెనీ పాలకుల అంతరంగాన్ని గ్రహించి, రానున్న పెను ప్రమాదాన్ని ముందుగా గుర్తించి హెచ్చరించింది, ఎదుర్కొంది ముస్లింలే కావటం గమనార్హం.

ప్రథమ స్వాతంత్ర్య సమరానికి వంద సంవత్సరాల ముందే బ్రిటీష్ పాలకులపై వ్యతిరేకత వ్యక్తమైంది. బెంగాల్లో బ్రిటీష్ వలస పాలకుల తొత్తులైన జమీందార్లకు వ్యతిరేకంగా ముస్లిం ఫకీర్లు మజ్నూషా నేతృత్వంలో 1763లో తిరుగుబాటు పతాకాన్ని ఎగురవేశారు. ఆ సమయంలో ఫకీర్లకు తోడుగా శ్రీ భవాని పాఠక్ నాయకత్వంలోని సన్యాసులు కూడా తిరుగుబాటులో పాల్గొనటంతో ఈ తొలి తిరుగుబాటు ఉద్యమం **ఫకీర్లు-సన్యాసుల ఉద్యమంగా** ఖ్యాతి గాంచింది. బ్రిటీష్ అధికారి లార్డ్ మెకంజీ నేతృత్వంలోని బ్రిటీష్ సైనిక దళాలను అనేకమార్లు ఓటమికి గురిచేసిన ఫకీర్లు-సన్యాసులు ప్రజల నుండి అపార ఆదరణ పొందారు. ఈ ఉద్యమంలో మూసాషా, చిరాగ్అలీ, నూరుల్ మహమ్మద్ తదితరులు ముఖ్య పాత్ర వహించారు. ఈ తిరుగుబాటు 1800 వరకు సాగింది.

## వహాబీ- ఫరైజీల తిరుగుబాటు

తొలి తిరుగుబాటు జెండా ఎగురవేసిన ఫకీర్లు-సన్యాసుల ఉద్యమం సమాప్తమైన రెండు దశాబ్దాల కాలంలోనే ముస్లింలు బ్రిటీష్ పాలకులను ఎదిరించేందుకు మళ్ళీ సిద్ధమయ్యారు. 1820 నుంచి 1870 ప్రాంతం వరకు సాగిన ఈ తిరుగుబాటు **వహాబీ ఉద్యమం గా ఖ్యాతిగాంచింది.** రాయ్‌బరేలీకి చెందిన సయ్యద్ అహమ్మద్ బరేల్వీ ఈ ఉద్యమానికి ఆద్యుడు. ఈ పోరాటానికి నాయకత్వం వహించి అమరులైన వారిలో టిటూమీర్, అబ్దుల్ అజీజ్, మహమ్మద్ మహషిన్, దూదూమియా, ఇనాయత్ అలీ, విలాయత్ అలీ ప్రముఖులు. ఈ యోధులు సుదీర్ఘకాలం సాగించిన పోరుకు సంబంధించిన విజయాలను, ఆ పోరాటయోధులు పాల్గొన్న చరిత్రాత్మక సంఘటనల గురించిన బెంగాల్ తదితర ప్రాంతాల ప్రజలు ఈ నాటికి స్మరించుకుంటున్నారంటే, ఆ పోరాటాల ప్రాముఖ్యతను ఊహించగలరు. ఈ ఉద్యమం వహాబీ ఉద్యమంగా ఖ్యాతిగాంచింది.



బొంబాయి, మధ్యప్రదేశ్, హైదరాబాద్‌లలో కూడా ఈ ఉద్యమానికి కార్యకర్తలు, మద్దతుదార్లు ఏర్పడ్డారు. అప్పటి హైదరాబాదు నవాబు సోదరుడు ముబారిజుద్దౌలా వహాబీ ఉద్యమంలో చురుకైన పాత్ర నిర్వహించారు. బ్రిటీష్ రాణికి వ్యతిరేకంగా కుట్ర పన్నాడన్న నేరారోపణగావించి, ముబారిజుద్దౌలాకు జీవిత ఖైదు విధించారు. ఆయన అనుచరులు మరో పదిమంది పది సంవత్సరాలకు పైబడిన జైలు శిక్షలకు గురయ్యారు. చిట్టచివరకు ముబారిజుద్దౌలా గోల్కొండలో అమరత్వం పొందారు. బ్రిటీష్ సామ్రాజ్య విస్తరణ కాంక్షను గుర్తించిన ఈ పోరాటాలన్నీ, ప్రజలమీద సాగుతున్న ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారుల దౌర్జన్యానికి వ్యతిరేకంగా ప్రారంభమై, బ్రిటీష్ వలస పాలకుల వైపునకు మళ్ళాయి. ఈ పోరాటాలచే స్ఫూర్తి పొందిన ప్రజలు, ప్రధానంగా యువకులు 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్యోద్యమంలో చురుగ్గా పాల్గొన్నారు.

ఈ పోరాటంలో అనేక మంది వహాబీలు అమరులయ్యారు. అటువంటి వారిలో షహీద్ పీర్ ఆలీ, ఇనాయత్ అలీ, ఫర్హత్ హుస్సేన్, మహమ్మద్ షౌకత్ అలీ ముఖ్యులు. వహాబీల నుండి ఎదురవుతున్న తీవ్ర ప్రతిఘటనను సహించలేని బ్రిటీష్ వలస పాలకులు వహాబీల మీద అనేక కుట్ర కేసులు బనాయించి వందలాది వహాబీ వీరులను రకరకాల తీవ్ర శిక్షలకు గురిచేశారు.

ఆ కాలంలోనే ఫరీద్‌పూర్‌కు చెందిన పీర్ షరీయతుల్లా నేతృత్వంలో మరో పోరాటం ప్రారంభమైంది. ఈ పోరు ఫరైజీ ఉద్యమంగా ప్రఖ్యాతి గాంచింది. ఈస్ట్ ఇండియా కంపెనీకి తొత్తులైన జమీందార్లు, వడ్డీ వ్యాపారులు, తేయాకు తోటల యజమానులు ఆ ప్రాంతం రైతుల మీద, సామాన్య జనం మీద సాగిస్తున్న పీడనకు వ్యతిరేకంగా ఈ తిరుగుబాటు ప్రారంభమైంది. ఈ తొత్తులకు అండ దండగా కంపెనీ పాలకులు రావటంతో ఉద్యమ కారుల అస్త్రశస్త్రాలు బ్రిటీష్ వలస పాలకులవైపు గురి పెట్టబడ్డాయి.


హాజీ షరియతుల్లా

ఈ ఉద్యమానికి హాజీ పీర్ షరీయతుల్లా శ్రీకారం చుట్టినప్పటికి ఆ ఉద్యమం దశను దిశను మార్చి సమరశీల పోరాటంగా బ్రిటీషర్లను ఖంగు తినిపించిన మహాయోధుడు దూదు మియా. ఆయన నేతృత్వంలో రైతాంగం, వివిధ వృత్తుల సామాన్య

ప్రజలు, వివిధ జనసముహాలు కలసికట్టుగా ఆయన వెంట నడిచారు. ఆ కారణంగా అతిత్వరలో ఈ పోరాటం పలు ప్రాంతాలకు వ్యాపించింది. 1830 నుండి 1900 వరకు సాగిన ఈ పోరాటంలో దూదు మియాకు వారసులుగా నోయామియా, బనీ అమీర్ మియా తదితరులు భాగస్వామ్యం వహించారు.

ఈ పోరాటాలు చాలా వరకు ప్రారంభదశలో మతం పునాదుల మీద, మత సంస్కరణల లక్ష్యంగా ఆరంభమైనప్పటికీ, వలస పాలకుల దోపిడికి ప్రజలు గురికావటం గమనించి తమ దశను-దిశను మార్చుకుని, పరాయి పాలకుల దాస్యం నుండి ప్రజలకు విముక్తి కలుగచేయాలన్న విస్తృత లక్ష్యంతో కంపెనీ పాలకులు, ఆ పాలకుల తొత్తుల మీద తిరుబాటుకు బాటలు వేశాయి. ఈ తిరుగుబాటు సమయంలో మతంతో ప్రసక్తి లేకుండా ప్రజా ప్రయోజనాలకు వ్యతిరేకంగా వ్యవహరించిన వారంతా ఆ యోధుల ఆగ్రహానికి బలికావటం విశేషం. ఆ తరువాత బ్రిటీష్ పాలకులను తరిమికొట్టేందుకు సాగిన పలు తిరుగుబాట్లకు ప్రేరణగా నిలచి స్వేచ్ఛా-స్వాతంత్ర్యాలకు ఈ పోరాటాలు బాటలు వేశాయి. బ్రిటీష్ పాలన మీద విచ్చుకత్తులతో విరుచుక పడి అగ్నియుగాన్ని సృష్టించిన, విప్లవకారులకు మార్గదర్శకం కావటమేకాకుండా స్ఫూర్తిదాయకంగా నిలిచినందున ఆ పోరాట వీరులను స్మరించని స్వాతంత్ర్యోద్యమ చరిత్ర అసంపూర్ణం.

## బ్రిటీషర్ల పాలిట భయంకరుడు టిపూ

బ్రిటీష్ పాలకుల రాజ్య విస్తరణ కాంక్షను గుర్తించిన టిపూ సుల్తాన్ ముంచుకు రానున్న ప్రమాదం గురించి సమకాలీన పాలకులను హెచ్చరించారు. టిపూ సుల్తాన్‌గా




ఖ్యాతిగాంచిన ఫతే ఆలీ మైసూర్ సామ్రాజ్యాధినేత. బ్రిటీష్ పాలకుల కుట్రలు కుయుక్తులను పసిగట్టిన ఆయన ఆ విషయాలను వివరిస్తూ 1780 దశకంలోనే స్వదేశీపాలకులకు అనేక ఉత్తరాలు రాశారు. బ్రిటీష్ పాలకుల ఎత్తులను చిత్తు చేస్తూ వీరోచితంగా పోరాడుతూ స్వదేశీ పాలకుల్ని తనతో కలసి రావాల్సిందిగా కోరారు. ముందుచూపు లేని స్వార్థపరులైన పాలకులు టిపూ హెచ్చరికలను ఖాతరు చేయకపోగా, బ్రిటీష్ పాలకులకు తొత్తులుగా మారారు. స్వదేశీ పాలకులు

టిపూ మాటను గౌరవించి ఉంటే ఈనాడు ఈ నేల మీద మేం పాలకులుగా ఉండేవాళ్ళం కాదని' బ్రిటీష్ అధికారులే ప్రకటించారంటే టిపూ ప్రయత్నాలు ఎంతటి ప్రాముఖ్యతగలవో అర్థం చేసుకోవచ్చు.

1799 మే 4న బ్రిటీష్ సైన్యంతో పోరాడుతూ టిపూ సుల్తాన్ అమరుడయ్యారు. టిపూ మృతి చెందారని తెలిసి, స్వయంగా వచ్చి మృతదేహాన్ని పరిశీలించి, మరణాన్ని నిర్ధారణ చేసుకున్న తరువాతగాని బ్రిటీష్ సైనికాధికారి జనరల్ హారిస్ **ఈనాటి నుండి ఇండియా మనదేనని** ప్రకటించేసాహసం చేయలేకపోయాడంటే, ఇండియాను కబళించాలని కలలు కంటున్న బ్రిటీష్ పాలకులకు **మైసూర్ పులి** ఎంతగా **ఆటంకమయ్యాడో** గ్రహించవచ్చు.

## ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం

టిపూ తరువాత 1857లో మొగల్ పాదుషా బహద్దూర్ షా జఫర్ నాయకత్వంలో సాగిన సమరం ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంగా ప్రసిద్ధి చెందింది. **ఈ పోరాటంలో** భాగంగా అవధ్‌కు చెందిన బేగం హజరత్ మహల్ విదేశీ పాలకులతో పోరాడి వారిని తరిమికొట్టి, చుట్టుముట్టిన శత్రుబలగాలను సవాల్ చేసి 14 మాసాల పాటు నిలువరించి, కలసి వచ్చిన స్వదేశీ పాలకులకు స్ఫూర్తినిస్తూ, సంక్లిష్ట సమయంలో రాజ్యభారాన్ని వహించింది. స్వయంగా ఏనుగు అంబారినెక్కి ఆంగ్లేయులతో సాగిన పోరాటాలలో ఆమె పాల్గొంది.


బహద్దూర్ షా జఫర్

స్వదేశీపాలకులను, ప్రజలను హెచ్చరిస్తూ, **ఆంగ్లేయుల కుట్రలను తేటతెల్లం** చేస్తూ, విక్టోరియా మహారాణి ప్రకటకు దీటుగా బేగం హజరత్ మహల్ చారిత్రాత్మక ప్రకటనను విడుదల చేశారు. ఆ ప్రకటన ఈ విధంగా సాగింది. '....హిందూ-ముస్లింలకు **ధర్మం, ఆత్మగౌరవం, ప్రాణం, ధనం అను నాలుగు అంశాలు ప్రధానం.** ఈ అంశాలను **కేవలం స్వదేశీ పాలనలో, స్వదేశీ పాలకులు మాత్రమే ప్రసాదించగలరు.** కంపెనీ సైనికులు ప్రజలను దోచుకుంటున్నారు. **ఆత్మగౌరవాన్ని** మంటకలుపుతున్నారు. స్త్రీల మీద అఘాయిత్యాలు, అత్యాచారాలు జరుపుతున్నారు...హిందూ-ముస్లిం పౌరులను హెచ్చరిస్తున్నాం. **ఆత్మగౌరవంతో,** ధర్మబద్ధంగా ప్రశాంత జీవితం సాగించాలంటే స్వదేశీ పాలన కోసం శత్రువులకు వ్యతిరేకంగా ఆయుధాలు చేపట్టండి. స్వదేశీ సైన్యంలో




**భర్తీకండి... మాతృదేశం కోసం సాగుతున్న పోరాటంలో భాగస్వాములవ్వండి. శత్రువుకు సహకరించకండి. ఆశ్రయం ఇవ్వకండి...'**

ఆనాడు, '**..these shortsighted individuals (the rebels) seem unmindful of the British supremacy and do their best to ruin myself and the whole country ( The Politics of a Popular Uprisings- Bundelkhand in 1857, Tapti Roy, OUP, 1994), అంటూ ఈస్ట్** ఇండియా కంపెనీ పాలకులకు విన్నవించుకున్న ఝాన్సీ రాణి లక్ష్మీబాయికి లభించినంత ప్రాచుర్యం బేగం హజరత్ మహల్‌కు లభించలేదు.

బ్రిటీష్ సైన్యాలను అడుగడుగునా మట్టికరిపిస్తూ ముందుకు సాగారు మౌల్వీ అహమ్మదుల్లాషా ఫైజాబాది. బ్రిటీష్ సైన్యాలను ముప్పుతిప్పలు పెట్టిన మౌల్వీని సజీవంగా లేక నిర్జీవంగా పట్టితెచ్చిన వారికి 50వేల రూపాయల నజరానాను ఈస్ట్ ఇండియా కంపెనీ ప్రకటించింది. ఆ భారీ నజరానా కోసం నమ్మక ద్రోహంతో ఒక విశ్వాసఘాతకుడు ఆయనను బలి తీసుకున్నాక, ఉత్తర భారత దేశంలోని **ప్రధాన శత్రువు అడ్డు తొలిగింది** అని బ్రిటీష్ సైన్యాధికారులు పండగ చేసుకున్నారు.

ఈ సందర్భంగా స్వదేశీ పాలకులలో దేశం పట్ల ప్రేమాభిమానాలను ప్రోదిచేసే లేఖలు రాసిన అజీముల్లా ఖాన్, మరోక మహాయోధుడు నానాసాహెబ్ పక్షాన పోరాటాల వ్యూహరచన చేసి శత్రువుతో అవిశ్రాంతంగా పోరాడారు. స్వయంగా **పయామే ఆజాది** అను పత్రికను నడిపి ఆనాటి స్వాతంత్ర్య సమరయోధులకు మార్గదర్శకం చేశారు. ఉత్తేజానిచ్చారు. ప్రజలలో దేశభక్తి భావనలను పెంపొందించేందుకు, ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ప్రజలను కూడగట్టేందుకు **పయామే ఆజాది** పత్రికను హిందీ, ఉర్దూ భాషల్లో అజీముల్లా ఖాన్ స్వయంగా ప్రచురించారు. మరాఠి భాషలో కూడా ఆ పత్రికను నడిపేందుకు ప్రయత్నాలు జరిగాయి. ఆ పత్రికలో **'..భారతీయ హిందువులారా, ముస్లింలారా లేవండి. సోదరులారా లేవండి. దైవం మనిషికి ఎన్నో వనరులను ఇచ్చాడు. అందులో విలువైనది స్వాతంత్ర్యం..'** అంటూ మొగల్ చక్రవర్తి బహుద్దూర్ షా జఫర్ ప్రజలకు ఇచ్చిన పిలుపును ప్రచురించారు. మాతృ దేశాన్ని కీర్తిస్తూ, బానిస బంధనాల నుండి విముక్తి కోసం పోరుబాట నడవమంటూ ప్రబోధ గీతం ఈ పత్రికలో ప్రచురితమైంది. ఉర్దూ భాషలో ప్రచురితమైన ఆ గీతం ఇలా సాగింది.

'హమ్ హై ఇస్‌కే మాలిక్
హిందూస్థాన్ హమారా !
పాక్ వతన్ హై ఖౌమ్‌కా జన్నత్‌సేభి ప్యారా
యే హై హమారీ మిల్కియత్,
హిందూస్థాన్ హమారా !
ఇస్‌కీ సలామియత్‌సే రోషన్ హై జగ్‌సారా
కితనా ఖదీమ్, కితనా నయీమ్
సబ్ దునియాసేం న్యారా
కరతీ హై జర్‌ఖేజ్ జిసే
గంగా జమునాకీ ధారా !
ఊపర్ బర్ఫీలీ పర్వత్ పహరెదార్ హమారా !
నీచే సాహల్‌పర్ బజ్‌తా, సాగర్ నక్కారా
ఆయా ఫిరంగీ దూర్‌సే ఐసా మంతర్ మారా !
లూటా దోనో హాతోం సే
ప్యారా వతన్ హమారా !
అజ్ షహీదోంనే తుమ్‌కో
అహెలే వతన్ లల్‌కారా !
తోడో గులామీకే జంజీరే, బరసావో అంగారా !
హిందూ, ముసల్మాన్ సిఖ్ హమారా
భాయీ భాయీ ప్యారా
యే హై ఆజాదికా ఝండా,
ఇసే సలామ్ హమారా ! '.

( భారత పత్రికల్లో ముస్లింల పాత్ర, వ్యాసకర్త ః ముక్తార్, గీటురాయి వారపత్రిక, హైదరాబాదు, 25-04-2003 నాటి సంచిక, పేజీ 23. )

ఈ మేరకు బ్రిటీష్ పాలకులకు అడుగడుగునా ఎదిరించిన యోధులలో మౌలానా లియాఖత్ అలీ ఖాన్, హిక్మతుల్లా ఖాన్, ప్రథమ స్వాతంత్ర్య సమరయోధుల సర్వసేనాని మహమ్మద్ భక్త్ ఖాన్, పరదేశీయుల ఆధిపత్యాన్ని అడుగడుగునా ఎదుర్కొన్న రాజసింహం షెహజాదా ఫిరోజ్ షా, ఝాన్సీరాణిని తిరుగుబాటుకు పురికొల్పిన బక్షీష్ అలీ ప్రధాన పాత్ర వహించారు. ఆనాటి పోరులో హిందూ- ముస్లింల ఐక్యతకు ప్రతీకగా ఖాన్ బహద్దూర్ ఖాన్ నిలిచారు.




ఈ పోరాటంలో అసంఖ్యాక మహిళలు కూడా పాల్గొన్నారు. ఈ మహిళలకు స్ఫూర్తిదాయకం బేగం హజరత్ మహల్, ఆంగ్లేయ యువతులే ఆయుధాలు చేపట్టటం ఎరుగని రోజుల్లో మహిళా సైనికాదళాలు ఏర్పాటు చేయటమే కాకుండా, స్వయంగా శిక్షణ గరిపి, నానా సాహెబ్ పక్షాన రణరంగంలో వీరవిహారం చేసిన పాతికేళ్ళ పడుచు బేగం అజీజున్ ఆదర్శం. ఆకస్మిక దాడులతో బ్రిటీష్ సైనిక శిబిరంలో భయోత్పాతం కల్గించింది పచ్చ దుస్తుల అజ్ఞాత వృద్ధురాలు, మాతృదేశ విముక్తి కోసం సాగుతున్న పోరాటంలో సంతోషంగా ఉరిని స్వీకరించిన బేగం హబీబా, బ్రిటీష్ సైనిక మూకలను సాయుధంగా ఎదుర్కొన్న బేగం రహిమా, ఝూన్సీ లక్ష్మీబాయికి వెన్నంటి నిలిచి ఆమెతో పాటుగా ఆంగ్లేయ అధికారుల తుపాకి గుళ్ళకు బలైపోయిన ముందర్ లాంటి మహిళలు మరికొందరు. తిరుగుబాటు యోధుల కుటుంబం నుండి వచ్చి, అన్నదమ్ములతో కలసి పోరు బాటన నడవటమే కాకుండా, పట్టుబడ్డాక దండు రహస్యం చెప్పడానికి నిరాకరించి అగ్ని మంటలకు ఆహుతై పోయిన సాహసి అస్గరీ బేగం లాంటి మహిళలు పురుషులతో ఏమాత్రం తీసిపోకుండా తమదైన భాగస్వామ్యాన్ని అందించి త్యాగచరితలయ్యారు.

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం విఫల మయ్యాక కూడా బ్రిటీష్ పాలకులకు వ్యతిరేకంగా ధర్మయుద్ధం చేయమంటూ ముస్లింలను ప్రేరేపించిన మౌలానా ఫజ్‌లే హఖ్‌ను ఈ సందర్భంగా గుర్తు తెచ్చుకోక తప్పదు. ఆ పిలుపుతో ఆగ్రహించిన పాలకులు ఆయనను బంధించి, క్షమాబిక్ష కోరితే స్వేచ్ఛ ప్రసాదిస్తామన్నా, అంగీకరించకుండా అండమాను జైలుకు ఆనందంగా వెళ్ళి అక్కడే ఆయన అమరుడయ్యారు. ఈ సంగ్రామంలో సుమారు 27 వేల మంది ముస్లిం స్త్రీ, పురుషులను బ్రిటీష్ సైన్యాలు పలు ప్రాంతాలలో ఉరితీసాయని, తగుల బెట్టాయని, క్రూరంగా చంపాయని, మరో 30 వేలమందిని ప్రవాసశిక్షలకు గురిచేశాయని చరిత్ర వెల్లడిస్తుంది.

ఈ ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ముస్లిం జనసముదాయాలు ఎంతగా పాల్గొన్నాయంటే, ఆంగ్లేయాధికారి Henry Mead ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ, this rebellion, in its present phase, cannot be called a sepoy Mutiny. It did

begin with the sepoys, but soon its true nature was reveled, it was an Islamic revolt అనాల్సి వచ్చింది.

ఆనాడు బెంగాలు సివిల్ సర్వీసులో అధికారిగా పని చేసిన Henry Harrington Thomas 1858 లో రాసిన Rebellion in India and our future policy అను శీర్షిక గల కరపత్రంలో, 'I have stated that the Hindus were not the contrivers or the primary movers of the 1857 rebellion and I now shall attempt to show that it was the result of an Mohammad conspiracy...left to their resources, the Hindus never would or could have compassed such an undertaking..' అని వ్యాఖ్యానించాడు.

## వెల్లివిరిసిన అద్భుత ఐక్యత

ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామంలో హిందూ-ముస్లిం ప్రజానీకం మధ్యన వెల్లివిరిసిన ఐక్యత ఆంగ్లేయుల గుండెల్లో గుబులు **రగిలించింది. సామాన్య ప్రజానీకం** మాత్రమే కాకుండా స్వదేశీ పాలకులు కూడా **తమ** విభేదాలను మరిచి ఐక్యంగా ఉమ్మడి **శత్రువును** ఎదుర్కోవటం వారి సామ్రాజ్య విస్తరణ **కాంక్షకు** విఘాతం కాగలదని భావించారు. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామానికి చోదక**శక్తిగా** నిలిచింది ముస్లింలన్న భావనతోనున్న **పాలక** వర్గాలు, ప్రజానీకంలో మత **విభేదాలను** సృష్టించి, స్నేహ సంబంధాలను విచ్ఛినం చేసి, **తమ** మనుగడకు ఎటువంటి ముప్పు లే**కుండా** **చూసుకోవాలని** అనుకున్నాయి. స్వదేశీ **పాలకు**లను, తిరుగుబాటు యోధులను అణిచి వేసేం దుకు **కూడా ఈ ఎత్తు ఉపయోగిస్తుందను** **కున్నాయి.**


ఖాన్ బహద్దూర్ ఖాన్

ముస్లింలకు వ్యతిరేకంగా హిందువులను రెచ్చగొట్టి, మభ్యపెట్టి డబ్బుతో ప్రజల దేశభక్తిని కొనుగోలు చేసేందుకు భారీగా డబ్బు సంచులను రప్పించారు. ఈ మేరకు రోహిల్ ఖండ్‌లో డబ్బు సంచుల ద్వారా హిందూ సోదరులకు లంచాలు ఇచ్చి, అర్థిక సౌకర్యాల ఆశ చూపించి ఆకట్టుకుని, ప్రజలను మతం పేరిట చీల్చి అనైక్యత సృష్టిం చేందుకు ఆంగ్లేయాధికారి జేమ్స్ ఔట్రాం (James Outram ) విఫలయత్నం చేశాడు.

ఆ పాపిష్టి సొమ్ము మా ఐక్యత ముందు దిగదుడుపు అని ప్రజలు తిరస్కరించారు. ఆ డబ్బు కోసం మా ఐక్యతను బలి చేసేది లేదని స్పష్టం ప్రకటించారు. తమ ముంగిళ్ళలోకి తరలి వచ్చి డబ్బు సంచులను తిరగ్గొట్టారు. చివరకు కంపెనీ ఖజానా నుండి దిగుమతి చేసిన సొమ్మును తిరిగి ఖజానాకు పంపించాల్సి వచ్చింది.

ఈ విషయాన్ని T. R Metcalf తన The Aftermath of Revolt అను గ్రంథంలో, 'Sir James Outram (1803-63) failed to raise Hindus in Rohilkhand against the regime of Khan Bahadur Khan and had to return money granted for the purpose unspent to the treasury.' ( page 299 ), అని పేర్కొన్నాడు.

మా మతాలు వేరైనా మా మాతృభూమి ఒక్కటే, మా మార్గం ఒక్కటే, మా లక్ష్యం ఒక్కటేననుకున్న ప్రజలు, మతం పేరిట మనుషుల్ని చీల్చి తమ పబ్బం గడుపుకొవాలనుకున్న బ్రిటీష్ పాలకుల ఎత్తులను త్రిప్పికొట్టారు. ఈ సందర్భంగా శత్రువుతో పోరు సాగించేందుకు ప్రజలలో వ్యక్తమైన సంసిద్ధత, వెల్లడైన ఐక్యత, బ్రిటీష్ అధికారులలో కంపరం పుట్టించింది.

ఈ ఐక్యతను విచ్ఛినం గావించనిదే తమ పాలనకు మనుగడలేదని గ్రహించిన పాలకులు భారత దేశంలోని ప్రధాన సాంఘీక జనశ్రేణులైన హిందూ-ముస్లింలను మతం పేర వేరుచేయటానికి ఎత్తులను, కుయుక్తులను యధేచ్ఛగా సాగించారు. బ్రిటీష్ పాలకులు ఎంతవరకు వెళ్ళారంటే ముస్లింల పాలనకంటే బ్రిటీష్ పాలన కడుమెరుగైనదన్న మానసిక భావన హిందూ జనసముదాయాలలో కలుగ జేసేందుకు చరిత్రను వక్రీకరించి రాసేందుకు పూనుకున్నారు. గత ముస్లిం పాలకులకు వ్యతిరేకంగా చరిత్రను తిరగ రాయించుకున్నారు. అలా రాసిన చరిత్రకు బహుళ ప్రచారం కల్పించారు.

ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ ఆంగ్ల రచయిత J.S. Grewal తన పుస్తకం Muslim Rule in India : The Assessment of British Historian (Oxford University Press,1970) లో '..British administrators scholars, historians and missionaries all became seriously involved in making the people to believe that British rule was better than the medieval Muslim Rule.' అన్నాడు.

ఈ ప్రయత్నాలు చాలా వరకు బ్రిటీషర్లకు అనుకూల ఫలితాలనిచ్చాయి. ఆనాడు బ్రిటీషర్లకు ఉపయోగపడిన ఆ రచనలు ఈనాడు కూడా ముస్లిం వ్యతిరేక శక్తులకు ఉపయోగపడుతున్నాయి. ముస్లిం జనావళికి వ్యతిరేకంగా అపోహలు, అపార్థాలు సృష్టించి

ప్రచారంగావించే శక్తులకు, వ్యక్తులకు ఈ గ్రంథాలు ప్రధానంగా ఆధారం అవుతున్నాయి. ఆంగ్లేయ వలసపాలకులు తమ కుటిల ప్రయత్నాలతో దేశాన్ని చీల్చగలిగేంత వరకు విజయం సాధించినా, భారతీయుల ఐక్యపోరాటాల ఫలితంగా చివరకు మూట ముల్లే సర్దుకుని పారిపోక తప్పలేదు.

ఈ మేరకు ఇలియట్, డౌసన్, మాల్కం, బ్రిగ్స్, ఎలిఫిన్ స్టోన్ లాంటి అధికారులను, చరిత్రకారులను చరిత్ర వక్రీకరణకు, ప్రత్యేక చరిత్ర రచనకు నియమించారు. ఆ సమయాన విలియం హంటర్ లాంటి అధికారులు 'ఇండియన్ ముస్లింలు' అను గ్రంథాన్ని రాసి ముస్లింలకు అనుకూలంగా ప్రభుత్వం చేపట్టాల్సిన పలు చర్యలును వివరిస్తూ, ముస్లింలు ప్రత్యేక జాతి జనులుగా పేర్కొన్నాడు.

## తెలుగుజాతి ముద్దుబిడ్డలు

బ్రిటీష్ పాలకులపై తిరుగుబాటు చేసిన వారిలో మన రాష్ట్రానికి చెందిన ముద్దుబిడ్డలు ఉండటం తెలుగుజాతి గర్వించదగిన అంశం. 1857లో బ్రిటీష్ రెసిడెన్సీ మీద సాయుధులై దండెత్తిన దళాలకు నాయకుడు పఠాన్ తుర్రేబాజ్ ఖాన్, జులైలో మెదక్ సమీపాన బ్రిటీష్ సైన్యంతో పోరాటం జరిపారు. ఈ పోరులో సహచరులందర్నీ కోల్పోయిన ఆయన శత్రువు చేత చిక్కరాదన్న పట్టుదలతో ప్రయత్నించారు. శత్రుసైన్యాల కళ్ళుగప్పి అంతర్ధానమయ్యారు. ఆయన కోసం అన్వేషణ సాగింది. ఆయనను బంధించి అప్పగించినవారికి అప్పట్లోనే ప్రభుత్వం 5 వేల రూపాయలు నజరానా కూడా ప్రకటించింది. అతి ప్రయాస మీద బ్రిటీషు సైనికులు ఆయనను అరెస్టు చేశారు. ఆ యోధుడ్ని చిత్రహింసలకు గురి చేసి, ఉరిశిక్ష విధించారు. బ్రిటీషు వ్యతిరేక పోరుకు నాయకత్వం వహించినందున తుర్రేబాజ్ ఖాన్‌పై కసితీరని బ్రిటీష్ పాలకులు ఆయన భౌతికకాయాన్ని ప్రస్తుతం హైదరాబాదులోని సుల్తాన్ బజారు పోలీస్ స్టేషన్ సెంటర్‌లో బహిరంగా వ్రేలాడదీసి తమ పైశాచికత్వాన్ని చాటుకున్నారు.


మౌల్వీ అల్లావుద్దీన్

ఆ బాటలో నడిచి, తుర్రేబాజ్ ఖాన్‌కు అండదండలు అందించిన మౌల్వీ అల్లావుద్దీన్‌ను



అరెస్టు చేసి ద్వీపాంతర వాసానికి పంపారు. ఆ క్రమంలో సయ్యద్ అహమ్మద్ 1857 జులై 17న పోరుసల్పుతూ ప్రాణాలు విడిచారు. బోయనపల్లిలో బ్రిటీష్ సైనికాధికారి కల్నల్ డేవిడ్‌సన్‌ను చంపే ప్రయత్నంలో జహంగీర్ ఖాన్ అను మరో యోధుడు కాల్చివేయబడ్డారు.

ఆంధ్ర ప్రదేశ్‌లోని విశాఖపట్నం బ్రిటీషు సైన్యంలో సైనికాధికారిగా పనిచేస్తున్న సుబేదార్ అహమ్మద్ తిరుగుబాటుకు నాయకత్వం వహించారు. ఈ తిరుగుబాటులో అహమ్మద్ వెంట నడిచిన తిరుగుబాటు సిపాయీలందర్ని ఆయన కళ్ళ ముందే కాల్చి చంపేశారు. చివరకు సుబేదార్ అహమ్మద్‌ను ఫిరంగి గొట్టపు రంధ్రానికి కట్టి పేల్చి వేశారు. ఈ మేరకు బ్రిటీషు వారికి వ్యతిరేకంగా సాగిన పలు పోరాటలలో పాల్గొన్న యోధులు ఎంతో మంది ఉన్నారు. ఈ వీరులంతా తెలుగు గడ్డకు చెందినవారు కావటం గర్వించదగిన అంశం.

## పాత్రికేయుడు మహమ్మద్ బాకర్ త్యాగం

1857లో నాటి ప్రథమ స్వాతంత్ర్యోద్యమంలో ఆనాటి పత్రికలు కూడా బృహత్తరమైన పాత్రను నిర్వహించాయి. ఆనాడు ప్రధానంగా ఢిల్లీ కేంద్రంగానూ, ఇతర ప్రాంతాల నుండి 'ఢిల్లీ అక్బార్', 'కొహినూర్', ' తారిఖ్-ఎ-భగవత్-ఎ-హింద్ ', 'ముషిర్-ఎ-దక్కన్ ', 'వకీల్' వంటి పలు పత్రికలు బ్రిటీష్ వ్యతిరేకతను ప్రజానీకంలో ప్రోది చేస్తూ సాహసవంతమైన పాత్రను పోషించాయి

ప్రథమ స్వాతంత్ర్య సమరానికి తిరుగులేని మద్దతునిస్తూ తిరుగు బాటుదార్లలో బ్రిటీష్ పాలకుల పట్ల తీవ్ర ప్రతిఘటన జ్వాలలను మండించింది "ఢిల్లీ అక్బార్" పత్రిక.

బ్రిటీష్ పాలకులు ఆ పత్రిక సంపాదకులైన మౌల్వీ మహమ్మద్ బాకర్‌ను 1858లో అరెస్టు చేసి దారుణ చిత్రహింసలకు గురిచేసి హత్యగావించారు. ఈ విధంగా పత్రికా స్వేచ్ఛకై ప్రాణాలర్పించిన తొలి పాత్రికేయులుగా ముహమ్మద్ బాకర్ చరిత్రలో నిలిచిపోయారు.

ఆనాటి పత్రికలన్నీ విదేశీ పాలక శక్తుల మీద తమ అక్షరాయుధాలను ప్రయోగించటంతో భీతిల్లిన పాలకులు పత్రికలను నిషేధించి, సంపాదకులను, ప్రచురణ కర్తలనేకాక, పాఠకులను కూడా తీవ్ర నిర్బంధాలకు గురి చేశారు. ఈ కారణంగానే 1853 నాటికి ఉన్న 35 ఉర్దూ పత్రికలు కాస్తా 1858 నాటికి 12 తగ్గిపోయాయంటే బ్రిటీష్ పాలకులు ఎంత క్రూరంగా వ్యవహరించారో తేలిగ్గానే ఊహించవచ్చు.

## ముస్లింల ఊచకోత

ప్రథమ స్వాతంత్ర్య సమరాన్ని ప్రారంభించినవారు, పాల్గొన్నవారు, ప్రోత్సహించిన వారు ప్రధానంగా ముస్లింలేనన్న అభిప్రాయానికొచ్చిన బ్రిటీష్ పాలకులు 27 వేల మంది ముస్లింలను వివిధ ప్రాంతాలలో ఉరితీశారని చరిత్ర రికార్డులు చెబుతున్నాయి. ఈ సంఖ్య కంటే అనేక రెట్లు ఆనాడు జరిగిన సామూహిక హత్యాకాండంలో ప్రజలు ప్రాణాలు కోల్పోయారు. అప్పటి నుండి ముస్లిం కులీన వర్గాలతోపాటు, సామాన్య ప్రజానీకాన్ని కూడా అన్ని విధాలుగా కృంగదీసి నిర్వీర్యం చేసేందుకు అనువైన పథకాలు, విధానాలు బ్రిటీష్ పాలకులు అమలుపర్చారు. ఆనాడు అమలు చేసిన పథకాలు



దుష్పరిణామాల ఫలితం ఈనాటికీ కూడా భారతీయ ముస్లింల వెనుకబాటు తనంలో ప్రతిఫలిస్తుంది.

ఆనాడు హిందూ-ముస్లిం ప్రజానీకం మధ్య నెలకొన్న బలమైన ఐక్యతను చూసి పాలకులు కలవరం చెందారు. ఈ రెండు ప్రాంఘిక జన సముదాయాలను చీల్చేందుకు కుట్రపూరితంగా వ్యవహరించారు. చరిత్రను వక్రీకరించారు. ముస్లిం పాలకుల కంటే తమ పాలన మెరుగైనదన్న అభిప్రాయం భారతీయులలో కలుగు చేసేందుకు ఆంగ్లేయ చరిత్రకారులు గ్రంథ రచన సాగించారు. ముస్లిం పాలకులు పరమత విద్వేషులుగా, రాక్షసులుగా చిత్రీకరిస్తూ చరిత్ర రచన గావించారు. ఆ విధంగా వక్రీకరణ, చిత్రీకరణలకు గురైన చరిత్ర ఆధారంగా ఆ తరువాత కాలంలో భారత చరిత్ర రచన సాగటం వలన సహజంగానే స్వదేశీ చరిత్రకారులు ఆ ప్రభావానికిలోనై, ముస్లింల బ్రిటీష్ వ్యతిరేక వీరోచిత గాధలను విస్మరించారు.

## భారత జాతీయ కాంగ్రెస్‌లో బృహత్తర పాత్ర

ప్రథమ స్వాతంత్ర్య సమరం తరువాత సుమారు మూడు దశాబ్దాల కాలం ముగియకముందే1885లో ఏర్పడిన భారత జాతీయ కాంగ్రెస్ జాతీయోద్యమ నాయకత్వాన్ని స్వీకరించింది. ఆనాటి తొలిదశ నుండి మలిదశ వరకు భారతీయ ముస్లింలు


Delegates to the First Session of the Indian National Congress, 1885


రహిమతుల్లా సయానీ

లక్ష్యసాధనలో చారిత్రాత్మక పాత్ర నిర్వహించారు. జాతీయ కాంగ్రెస్ ఏర్పడిన తొలిదశలో బద్రుద్దీన్ తయ్యాబ్జీ, రహమతుల్లా సయాని లాంటి ప్రముఖులు కాంగ్రెస్ అధ్యక్ష పీఠాన్ని అలంకరించారు. మౌలానా షిబ్లీనోమాని కాంగ్రెస్ పక్షాన పూర్తిగా నిలిచారు. మీర్ హుమాయూన్ కర్మాన్ లాంటి సంపన్నులు జాతీయ కాంగ్రెస్‌కు అప్పట్లోనే 5 వేల రూపాయల విరాళం సమర్పించారు. ఆలీ ముహమ్మద్ భీంజీ లాంటి ప్రముఖులు దేశమంతటా విస్తృతంగా పర్యటించి కాంగ్రెస్ పార్టీ పటిష్టతకు అవిశ్రాంత కృషి సల్పారు.

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో క్రియా శీలక పాత్ర నిర్వహించిన కారణంగా ఆంగ్లేయుల దాష్టీకానికి గురై పలు ఇక్కట్లుపడుతున్న ముస్లిం జనసముదాయాల సముద్ధరణ పాలకులతో పేచీసడితే సాధ్యం కాదని భావించిన మేధావులు సర్ సయ్యద్ ఆహమ్మద్, సయ్యద్ అమీర్ అలీ లాంటి ప్రముఖులు భారత జాతీయ కాంగ్రెస్‌లో ముస్లింల చేరికను వ్యతిరేకించారు. ఈ మేరకు తమ అభిప్రాయాలను వ్యక్తంచేస్తూ జాతీయ కాంగ్రెస్‌ను సమర్థిస్తున్న ప్రముఖుల మీద విమర్శలు గుప్పించారు. ఆ విమర్శలకు జస్టిస్ బద్రుద్దీన్ తాయ్యాబ్జి, రహిమతుల్లా యం. సయాని లాంటి వారు తగురీతిన సమధానాలిస్తూ అత్యంత సాహసోపేతంగా ముందుకు ఉపక్రమించారు. ప్రతికూల వాతావరణంలో కూడా ఈ నేతలు సాగించిన కృషి వలన ఇతర జనసముదాయాలతో పాటుగా ముస్లింలు కూడా జాతీయ కాంగ్రెస్ భవిష్యత్తుకు పునాదిరాళ్ళయ్యారు.


బద్రుద్దీన్ తయ్యాబ్జి

ఆ తరువాత కాలంలో జస్టిస్ బద్రుద్దీన్ తయ్యాబ్జి, రహిమతున్లా యం. సయాని, మౌల్వీ మజహరుల్ హఖ్, డాక్టర్ యం.ఎ. అన్సారి, మౌలానా అబుల్ కలాం ఆజాద్, నవాబ్ సయ్యద్ బహుదూర్, హసన్ ఇమాం లాంటి పలువురు ప్రముఖులు అధ్యక్షస్థానాన్ని చేపట్టారు. జాతీయోద్యమం కీలక దశల గుండా సాగుతున్నప్పుడు సమర్థవంతంగా ఈ

నేతలు తమ పాత్రను నిర్వహించి ఉద్యమానికి ప్రాణం పోశారు. ఆ క్రమంలో మౌలానా ఆజాద్ 1923 లో తన 35 ఏండ్ల వయస్సులో అధ్యక్షస్థానాన్ని చేపట్టటమే కాక 1940లో మరోసారి కాంగ్రెస్ అధ్యక్షపీఠం అలంకరించి, ఏడు సంవత్సరాల పాటు ఆయన ఆ పదవిలో ఉండి చరిత్ర సృష్టించారు.

## ఉలెమాల ప్రేరణ

బ్రిటీష్ వలస పాలకులు హిందూ-ముస్లింల మధ్య విభజన తెచ్చి పబ్బం గడుపుకోవాలని తీవ్ర ప్రయత్నాలు చేయసాగారు. అయితే ముస్లింల ధార్మిక మార్గదర్శకులైన ఉలెమాలు ఆ కుయుక్తులను వమ్ముచేస్తూ జాతీయ కాంగ్రెస్‌కు సంపూర్ణ మద్దతు ప్రకటించారు. జాతీయోద్యమంలో పాల్గొనటం ముస్లింల విధిగా పేర్కొంటూ విస్తృతంగా ఫత్వాలు జారీ చేశారు. స్వదేశానికి చెందిన వందలాది ఉలెమాలే కాకుండా మదీనా, బాగ్దాద్‌లకు చెందిన ఉలేమాలు కూడా ఇటువంటి ఫత్వాలపైన ఆమోద ముద్ర వేశారు. జాతీయ కాంగ్రెస్‌తో చేతులు కలపొద్దని సర్ సయ్యద్ అహమ్మద్ ఖాన్, అబ్దుల్ లతీఫ్, సయ్యద్ అమీర్ ఆలీ లాంటి ప్రముఖులు సలహాలిచ్చినప్పటికీ మౌలానా ముహమ్మద్ లాంటి వారు ' **నమాజ్ నాకు ఎంతటి విధి అయిందో.....నా దేశ స్వాతంత్ర్యం కోసం పోరాడటం కూడా అంతే తప్పనిసరైన విధిగా** ' పేర్కొ న్నారు.

ఈ తరహాలో మౌలానా షిబ్లీ నొమాని, మౌలానా రషీద్ అహమ్మద్, మౌలానా సైఫుల్లా, మౌలానా ముహమ్మద్ షిరాజీ, మౌలానా ముహమ్మదుల్ హసన్ తదితర ప్రముఖ ధర్మవేత్తలు బ్రిటీష్ పాలకులకు వ్యతిరేకంగా జాతీయోద్యమంలో పాల్గొనాల్సిందిగా ముస్లింలను కోరారు. స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని బ్రిటీష్ పాలకులకు వ్యతిరేకంగా పోరాడాల్సిందిగా ప్రజలను కోరుతూ వివిధ ప్రాంతాలకు చెందిన పలువురు ఉలేమాలు ఉమ్మడిగా చేసిన విజ్ఞప్తులను ' Nusrat-ul- Abrar ' పేరుతో ఒక బుక్‌లెట్ కూడా ఆనాడు ప్రచురితమై విస్తారంగా పంపిణీ జరిగింది.

## విభిన్న మార్గాలలో బ్రిటీష్ వ్యతిరేకత

ఈ మేరకు ప్రజలకు పిలుపు నిచ్చిన ఉలెమాలను బ్రిటీష్ ప్రభుత్వం తీవ్ర నిర్బంధాలకు, భారీ మొత్తాలలో జరిమానాలకు, ద్వీపాంతర వాసాలకు గురిచేసి కిరాత కంగా అణిచివేయసాగింది. 1863 ప్రాంతంలో ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని షహరాన్‌పూర్

జిల్లా దేవ్‌బంద్ కేంద్రంగా **దారుల్ ఉలూమ్** ఏర్పడింది. ఈ సంస్థను మౌలానా ముహహమ్మద్ ఖాసిం స్థాపించారు. 1847లో షామ్లిలో జరిగిన తిరుగుబాటులో కత్తిపట్టి బ్రిటీష్ సైనికదళాల మీద విరుచుకుపడ్డ చరిత్ర ఆయనది. పరాయి పాలకులకు వ్యతిరేకంగా పోరాడాల్సిన ఆవశ్యకతను ఆయన విద్యార్థులకు, యువతకు వివరించి కార్యోన్ముఖులను గావించారు. ఈ విధంగా ఒకే నాణేనికి రెండు పార్శ్వాలుగా దేవ్‌బంద్, షామ్లి కేంద్రాలు విభిన్న మార్గాలను ఎన్నుకుని బ్రిటీష్ ప్రభుత్వ వ్యతిరేక పోరుకు ముస్లింలను ప్రోత్సహించాయి. అటు ధార్మిక నేతలు, ఇటు లౌకిక నాయకులు, జాతీయ కాంగ్రెస్ కార్యక్రమాలను ప్రోత్సహించటం ద్వారా విదేశీ పాలకుల మీద యుద్ధభేరిని మ్రోగించమని ముస్లింలకు పిలుపునిచ్చారు. ఆ పిలుపు నందుకున్న భారతీయ ముస్లిం జనసమూహాలు జాతీయ కాంగ్రెస్ కార్యక్రమాలలో పాల్గొంటూ తమదైన పాత్రను నిర్వహించాయి.

## బెంగాల్ విభజనకు తీవ్ర ప్రతిఘటన

1905లో లార్డ్ కర్జన్ బెంగాల్‌ను విభజించాడు. హిందూ-ముస్లింల మధ్యగల ఐక్యతకు గండికొట్టడం ఈ విభజన ఉద్దేశ్యం. బెంగాల్ ప్రజలు తిరగబడ్డారు. బెంగాల్‌లో ప్రారంభమైన విభజన వ్యతిరేక ఉద్యమంలో ముస్లిం జనసామాన్యుల నుండి ప్రముఖుల వరకు చురుగ్గా పాల్గొన్నారు. ఈ పోరులో బారిస్టర్ అబ్దుల్ రషీద్, లియాఖత్ హుస్సేన్, అబ్దుల్ హలీం ఘజనవీ, మహమ్మద్ యూసుఫ్ ఖాన్ బహద్దూర్, గులాం ఇమాం, ఇస్మాయిల్ చౌదరి, మౌల్వీ లియాఖత్ అలీ, మౌల్వీ అబ్దుల్ ఖయ్యూం, మున్షీ హిదాయత్ బక్ష్, మొహమ్మద్ అలీ భీంజి, ఎ.హెచ్. గజనవి లాంటి నాయకులు ప్రముఖ పాత్ర వహించారు.

ప్రస్తుత బంగ్లాదేశ్ రాజధాని ఢాకా కేంద్రంగా నవాబు సమీయుల్లా లాంటి ప్రముఖులు విభజనను సమర్థించినా, ఆయన కుటుంబానికి చెందిన నవాబ్ అతీఖుల్లా ఖాన్ లాంటి ప్రముఖులు ఆయనతో ఏకీభవించక పోగా, సోదరుడు సమీయుల్లా ప్రకటన వ్యక్తిగతం మాత్రమేనని, అది కుటుంబ నిర్ణయం కాదని ప్రకటించి సంచలనం సృష్టించారు. ఈ పోరాటంలో భాగంగా ప్రారంభమైన స్వదేశీ ఉద్యమంలో ముస్లింలు అధిక సంఖ్యలో పాల్గొన్నారు.

ఈ స్వదేశీ ఉద్యమాన్ని ఓ పవిత్ర కార్యంగా మౌలానా హస్రత్ మోహాని స్వీకరించారు. గురువు ప్రభావంతో చిన్ననాటి నుండి 'స్వదేశీ' మరియు 'సహాయ

నిరాకరణ' అంశాల పట్ల ఆసక్తి కలిగియున్న ఆయన తన భార్య బేగం నిషాతున్నీసా తో కలసి 'స్వదేశీ స్టోర్స్' ను కూడా ప్రారంభించారు. 1903 ఆరంభించిన ఉర్దూ పత్రిక URDU-E-MOALLA ద్వారా స్వదేశీ ఉద్యమానికి ప్రచారం కల్పిస్తూ, బ్రిటీషర్లకు వ్యతిరేకంగా '**ఇది మంచి ఆయుధం**' కాగలదన్నారు. ఈ కారణంగా ఆయన ప్రభుత్వం ఆగ్రహానికి గురయ్యారు. ఆయన పత్రికను జప్తు చేసిన ప్రభుత్వం 50 రూపాయల జరిమానా విధించింది. ఆ జరిమానా మొత్తాన్ని కట్టడానికి ఇష్టపడని మౌలానాను అరెస్టు చేయడం మాత్రమే కాకుండా అతి విలువైన ఆయన గ్రంథాలయాన్ని, ప్రెస్‌ను అతి స్వల్ప మొత్తం కోసం అధికారులు జప్తు చేశారు.

ఈ రకంగా బెంగాల్ విభజన వ్యతిరేక ఉద్యమం, స్వదేశీ ఉద్యమంలో పాల్గొన్న ప్రతి ముస్లిం కుటుంబానికి తీవ్ర నష్టం కలిగించింది. ప్రభుత్వం ఎంత దాష్టికంగా వ్యవహరించినా, బెంగాల్‌లో ఆరంభమైన ఈ స్వదేశీ ఉద్యమానికి ప్రత్యేక ప్రాధాన్యతనిస్తూ ముషీర్ హుస్సేన్ కిద్వాయి, ప్రస్తుత అంధ్ర ప్రదేశ్ రాజధాని హైదరాబాదుకు చెందిన ముల్లా అబ్దుల్ ఖయ్యూం అన్సారి తదితరులు ఎంతో కృషి చేశారు.

జాతీయ విద్యను ప్రోత్సహించేందుకుగాను అనేక పాఠశాలలు, కళాశాలలు ప్రారంభమైనాయి. ఈ సందర్భంగానే ఉనికిలోకి వచ్చిన '**వందే మాతరం**' నినాదం ప్రతి ఒక్కరికీ ఉత్తేజాన్నిచ్చింది. ఈ స్వదేశీ ఉద్యమంలో పాల్గొన్న నవాబ్ అమీర్ హుస్సేన్, మౌల్వీ హబీబుద్దీన్ అహమ్మద్, మౌల్వీ ఇస్మాయిల్‌లు బ్రిటీష్ ప్రభుత్వ తీవ్ర నిర్బంధాలకు గురయ్యారు.

## ఆల్ ఇండియా ముస్లిం లీగ్ స్థాపన

బెంగాల్ విభజనకు వ్యతిరేకంగా ఉద్యమం సాగుతున్న తరుణంలో, భారత దేశం భవిష్యత్తును ప్రభావితం చేయగల పరిణామాలు సంభవించాయి. అఖిల భారత ముస్లిం లీగ్, హిందూ మహాసభలు ఆవిర్భవించాయి.

ఆనాడు ముస్లింలకు చట్టసభలలో ప్రాతినిధ్యం చాలా తక్కువగా ఉంది. ముస్లిం ప్రముఖులు ఎంతటి సమర్థులైనప్పటికి వారికి కౌన్సిల్లో తగినన్ని స్థానాలు లభించటం లేదని ముస్లిం నేతలు భావించారు. ఈ విషయం మీద ' లెజిస్లేటివ్ కౌన్సిల్ ' లో మార్పులు తీసుకొచ్చేందుకు బ్రిటీష్ ప్రభుత్వం సూచనప్రాయంగా అంగీకరించింది. జాతీయ కాంగ్రెస్‌లోని కొందరు నాయకుల అతివాద పోకడలు, హిందూ-ముస్లింల

మధ్యనున్న ఐక్యతకు భంగం కలిగించేలా ప్రవర్తిస్తున్న తీరు ముస్లిం నేతలకు చాలా కష్టం కలిగించాయి. ఈ సమస్యను ప్రముఖ ముస్లిం నాయకుటు ఆగాఖాన్ కాంగ్రెస్ అగ్ర నేతలు శ్రీ ఫిరోజ్ షా మెహతా, శ్రీ గోపాల కృష్ణ గోఖలేల దృష్టికి కూడా తెచ్చారు. ఆ విషయమై గోఖలే స్పందించినప్పటికి మౌలికంగా తగిన మార్పులు కన్పించలేదు.

(Gokhale was ' deeply distressed to watch his political friends and associates. deliberately sowing the seeds of permanent disunity between Hindus and Muslims..' - From THE MEMORIES, by Aga Khan quoted by Shan Mohammad in Muslims and India's Freedom Movement, IOS, New Delhi, 2002, Page 83)

ముస్లిం జనసముదాయాల ప్రత్యేక సమస్యల పట్ల జాతీయ కాంగ్రెస్ నాయకులు సరిగ్గా స్పందించలేకున్నారని ముస్లిం నాయకులు కొందరు భావించారు. ఆ సమయంలో ముస్లిం సముదాయాల సమస్యలు, ఆకాంక్షలకు సంబంధించిన డిమాండ్‌లను ప్రభుత్వం దృష్టికి తీసుకొచ్చేందుకు ఓ సంస్థ అవసరమన్న నిర్ణయానికి వచ్చారు. అ అలోచనతో ఓ సంస్థ ఏర్పాటుకు ప్రముఖ ముస్లిం నాయకులు ముందుకొచ్చారు. ఆ ఫలితంగా 'అల్ ఇండియా ముస్లిం లీగ్' 1906 డిసెంబరు 6న ఉనికిలోకి వచ్చింది. ఈ సంస్థ స్థాపనకు ప్రధానంగా ఆగాఖాన్, నవాబ్ సమీయుల్లా, మోషినుల్ ముల్క్ కారకులయ్యారు. ఈ సంస్థ తొలి సమావేశంలో దేశంలోని ప్రముఖ ముస్లిం నేతలంతా పాల్గొన్నారు.

ప్రభుత్వంతో పేచీపడకుండా, ఆపార్థాలను తొలగించి, తమ సమస్యలను విన్నవించుకోవడం. ముస్లింల రాజకీయ హక్కులను కాపాడటం. ఇతర సాంఘిక జనసముదాయాల పట్ల ఎటువంటి ప్రతికూల భావనలు కలుగకుండా అడ్డుకోవటం ప్రధాన లక్ష్యాలుగా 'లీగ్ ' ప్రకటించుకుంది.

1909 మింటోమార్లి చట్టం ఉనికిలోకి వచ్చింది. ఈ చట్టం ద్వారా ముస్లింల కౌన్సిల్ ప్రవేశానికి మార్గం కొంత మేరకు సుగమం అయ్యింది. ఈ మార్పును శ్రీ గోఖలే అహ్వానిస్తూ, ఈ మార్పుకు అనుగుణంగా ముస్లింలు తృప్తిపడినట్లయితే జాతీయ స్థాయి వ్యవహారాలలో హిందువులు ముస్లింలకు హృదయపూర్వక సహకారం అందించగలరు. ఈ క్రమం ద్వారా మాత్రమే ఉమ్మడి విశ్వాసం ఏర్పడగలదు, అని ప్రకటించారు.

('If the Muslims were satisfied with it..they (the Hindus) would

give whole - hearted co-operation in the conduct of national affairs. By that process alone could mutual faith be generated..' - From THE MEMORIES, by Aga Khan quoted by Shan Mohammad in Muslims and India's Freedom Movement, IOS, New Delhi, 2002, Page. 85)

ఆరంభమైన ఆల్ ఇండియా ముస్లిం లీగ్‌లో ఆనాటి ప్రముఖ ముస్లిం నాయకులంతా జాతీయ కాంగ్రెస్‌లో ప్రముఖ పాత్రను నిర్వహిస్తూ కూడా లీగ్‌లో ప్రధాన పదవులలో బాధ్యతలు నెరవేర్చారు. ఆ తరువాత 'లీగ్' క్రమానుగతంగా మార్పులకు లోనవుతూ భారతదేశ రాజకీయలలో పెనుమార్పులకు కారణమైంది. ఆదిలో ప్రకటించి లక్ష్యాలకు భిన్నంగా విభజన-ద్విజాతి సిద్ధాంతం పల్లవిని లీగ్ అందుకోవటంతో జాతీయ భావాలు గల ముస్లిం నాయకులలో పలువురు ఆ తరువాత క్రమ క్రమంగా లీగ్‌కు దూరమయ్యారు. 1906లో బెంగాల్‌ను విభజించి ప్రజల తీవ్ర నిరసనను ఎదుర్కొన్న బ్రిటిష్ ప్రభుత్వం గత్యంతరం లేని పరిస్థితులలో దిగిరాక తప్పలేదు. 1911లో కింగ్ జార్జ్ స్వయంగా విభజన ఉత్తర్వులను రద్దు చేయాల్సి వచ్చింది.

## నిప్పులు కురిపించిన అగ్నియుగం

స్వదేశీ ఉద్యమం ఇచ్చిన స్ఫూర్తితో బ్రిటీష్ దాస్య శృంఖలాలను తెగ్గొట్టాలన్న సంకల్పంతో ప్రాణాలకు తెగించి పోరాడటానికి సిద్ధమైన దేశభక్తులు విప్లవ గ్రూపులుగా ఏర్పడ్డారు. ఈ గ్రూపులు విదేశాలలో, స్వదేశంలో రహస్య స్థావరాలు ఏర్పాటు చేసుకుని బ్రిటీష్ ప్రభుత్వం మీద పోరాటం ప్రారంభించాయి.


డాక్టర్ బర్కతుల్లా

**అగ్నియుగం**గా పిలువబడిన ఈ కాలంలోనే జుగాంతర్ గ్రూపుకు చెందిన 18 సంవత్సరాల ఖుదీరాంను, బ్రిటీష్ అధికారి భార్యను చంపిన నేరంపై అరెస్టు చేశారు. అరెస్టుకు ముందుగా అతనికి ఒక ముస్లిం యువతి ఆశ్రయం కల్పించింది. ఆమె విప్లవయోధుడు మౌల్వీ అబ్దుల్ వహీద్ సోదరి. '**ఖుదీరాంకి దీది**'గా ఆమె చరిత్రలో స్థానం సంపాదించుకుంది. అలాగే మరొక విప్లవ గ్రూపు '**గదర్ పార్టీ**' పేరుతో 1916లో శాన్‌ఫ్రాన్సిస్కోలో ఏర్పడింది. ఈ పార్టీలో డాక్టర్ బర్కతుల్లా, డాక్టర్ మన్సూర్,

అబ్దుల్ వహబ్, ప్రధాన పాత్రధారులు. ప్రథమ ప్రపంచ సంగ్రామంలో జావా, సుమిత్ర, తదితర ప్రాంతాలలోనున్న బ్రిటీష్ సైనికదళాలలోని భారతీయుల మద్దతుతో బ్రిటీష్ పాలనను తుదముట్టించాలన్నది గదర్ నేతల లక్ష్యం. గదర్ నాయకుల కార్యక్రమాల ఫలితంగా రంగూన్, సింగపూర్‌లలో భారతీయ సైనికులు తిరుగుబాటు చేశారు. ఢిల్లీ, పంజాబ్ ప్రాంతాలలో సయ్యద్ ఒబైదుల్లా సింధీ విప్లవ గ్రూపులను నిర్వహించారు.

ఈ ప్రయత్నంలో విప్లవ గ్రూపులలో కొన్ని రష్యా చక్రవర్తి సహాయం కూడా అర్థించాయి. ఉత్తర ప్రదేశ్‌లోని దేవ్‌బంద్‌కు చెందిన మౌలానా ముహమ్మదుల్ హసన్ మార్గదర్శకత్వంలో టర్కీ ప్రభుత్వాధినేత గాలిబ్ పాషా మద్దతుతో మధ్యప్రాచ్య దేశాలలోనున్న భారతీయ సైనికులను సమీకరించి బ్రిటీష్ సామ్రాజ్యానికి వ్యతిరేకంగా కూడగట్టేందుకు ఒబైదుల్లా సింధీ ప్రయత్నాలు చేశారు.

## సిల్క్ లేఖల కుట్ర

ఈ ప్రయత్నంలో భాగంగా సిల్క్‌గుడ్డ మీద రహస్య సంకేతాలతో భారతీయ సైనికులలో తిరుగుబాటును ప్రోత్సహిస్తూ లేఖలు పంపారు. ఈ లేఖల పంపిణీ **సిల్క్ లేఖల కుట్ర** గా ఖ్యాతిగాంచింది. ఆ సమయాన **గాలిబ్ పాషా** భారతీయ సైనికులకు పంపిన లేఖలు **గాలిబ్ నామా** గా ప్రసిద్ధి చెందాయి.

ఈ సిల్క్ లేఖ గుట్టురట్టు కావటంతో గదర్, దేవ్‌బంద్ యోధుల రహస్యాలు, కార్యకలాపాలు బహిర్గతమైపోయాయి. బ్రిటీష్ ప్రభుత్వం **భారతీయ సైనికులపై, విప్లవ** భావాలు గల యువకులపై విరుచుకుపడింది. తిరగబడిన సైనికులందరికీ కఠిన శిక్షలు విధించింది. అనేక మందిని కాల్చివేశారు. ఉరితీశారు. ద్వీపాంతరవాస శిక్షలకు గురి చేశారు. ఈ క్రమంలో భాగంగా 1915 నాటి సింగపూర్ తిరుగుబాటులో పాల్గొన్నందుకు ఉరిశిక్ష విధించ బడిన రసూలుల్లా ఖాన్, ఇంతియాజ్ అలీ, రుక్ముద్దీన్‌లు పశ్చాత్తాప ప్రతిపాదనను తిరస్కరించి వీరోచితంగా ఉరిని స్వీకరించారు.


మౌలానా ఒబైదుల్లా సింధీ

1916లో దేవ్‌బంద్ విప్లవకారులు గదర్ వీరులు కలసి తొలి స్వతంత్ర భారత ప్రభుత్వాన్ని ఆఫ్ఘనిస్తాన్‌లో ఏర్పాటు చేశారు. ఈ ప్రవాస భారత ప్రభుత్వానికి జర్మనీ, టర్కీ తదితర దేశాల మద్దతును కూడా ఆ విప్లవకారులు సంపాదించారు. ఈ ప్రభుత్వానికి అధ్యక్షులుగా శ్రీ రాజామహేంద్రవర్మ, ప్రధానమంత్రిగా డాక్టర్ బర్కతుల్లా, ఉపప్రధాన మంత్రిగా సయ్యద్ ఒబేదుల్లా సింధీ వ్యవహరించారు. ఈ వీరులతో హైదరాబాద్‌కు చెందిన షేక్ అబ్దుల్ రహమాన్ చేతులు కలిపారు.

1917 నాటి మాండలే కుట్రకేసులోని భారతీయ సైనికులలో ముస్తఫా హుస్సేన్, అమర్‌సింగ్, ఆలీ అహమ్మద్‌లు ముఖ్యులు. పలు ప్రాంతాలలో భారతీయ సైనికులు చేసిన తిరుగుబాట్లను బ్రిటీష్ ప్రభుత్వం ఉక్కుపాదంతో అణిచి వేసింది.

## మౌలానా ఆజాద్ రంగప్రవేశం

ఈ పరిస్థితులు గదర్ పార్టీకి, విప్లవ గ్రూపులకు అశనిపాతమయ్యాయి. విప్లవకారులంతా శిక్షలకు గురి కావటంతో అగ్నియుగం తొలిదశ అంతమైంది. అగ్నియుగం యోధుల వీరోచిత త్యాగాల స్ఫూర్తితో పలువురు యువకులు, విద్యార్థులు మాతృదేశ విముక్తి కోసం ప్రారంభమైన పోరాటంలో షహీద్ కావటానికి కదలి వచ్చారు. అటువంటి వారిలో మౌలానా అబుల్ కలాం అజాద్ ఒకరు. ఆయన కూడా తనదైన 'దారుల్ ఇర్షాద్' అను విప్లవ గ్రూపు ప్రారంభించారు. మాతృభూమి విముక్తి కోసం ప్రాణాలర్పించగల యువకులతో కిద్దిపూరు స్మశానంలో శపథం చేయించారు.


అబుల్ కలాం అజాద్

ఆనాడు మౌలానాకు విప్లవ గ్రూపులలో ప్రవేశం అంత తేలిగ్గా లభించలేదు. ఆ కారణంగానే ఆయన తనదైన పోరాట దళాన్ని ఏర్పాటు చేసుకోవాల్సి వచ్చింది. మౌలానా ఆజాద్ ముస్లిం కనుక బెంగాల్ విప్లకారులు తొలుత మౌలానాను విశ్వసించలేదు. చివరకు ఆ తరువాత ఆయనలోని విద్వత్తు, సామర్థ్యాన్ని గమనించిన విప్లవకారుల దళాలు ఆయన సూచన మేరకు తమ విప్లవ కార్యకలాపాలను ఇతర ప్రాంతాలకు విస్తరించేశాయి. మౌలానా ప్రముఖ అనుచరుడిగా ప్రసిద్ధి చెందిన

జలాలుద్దీన్ అహమ్మద్ బెంగాల్లో విప్లవ కార్యకలాపాలను విజయవంతంగా నిర్వహించారు.

బ్రిటీష్ కుయుక్తులను ఎండగడుతూ దేశీయులను పోరుబాట దిశగా ప్రోత్సహించేందుకు మౌలానా **అల్-హిలాల్** పత్రికను నడిపారు. అనుశీలన సమితిలో సభ్యత్వం తీసుకున్నారు. అజాద్‌ను **ప్రమాదకర వ్యక్తి** గా బ్రిటీష్ ప్రభుత్వం ఆనాడు పరిగణించింది. అనంతర కాలంలో ఆజాద్ అహింసా మార్గం పట్ల ఆకర్షితులై జాతీయ కాంగ్రెస్‌లో సభ్యులయ్యారు. అచిరకాలంలో జాతీయోద్యమంలో అగ్రనాయకులుగా ఎదిగారు.

ఆజాద్‌తోపాటుగా ఆనాడు జనాబ్ ముహమ్మద్ ఆలీ **కామ్రేడ్, హందర్ద్** అను పత్రికలను, జనాబ్ వహీదుద్దీన్ సలీం **ది ముస్లిం గజిట్**, జనాబ్ జఫర్ ఆలీఖాన్ **జమీందార్** లాంటి పత్రికలను నడిపారు. ఈ పత్రికలపై కన్నెర్ర చేసిన బ్రిటీష్ ప్రభుత్వం దారుణమైన దాడులు జరిపి, సంపాదకులను, ప్రచురణకర్తలను, జైళ్ళ పాల్జేసింది. మాతృభూమి స్వేచ్ఛా-స్వాతంత్ర్యాల కోసం అక్షరాలతో పరాయిపాలకుల మీద యుద్ధం ప్రకటించిన పత్రికలను బ్లాక్‌లిస్ట్‌లో పెట్టి నిషేధించింది.

## గాంధీజీ ప్రాణాలను కాపాడిన బతఖ్ మియా అన్సారి

బీహార్‌లోని చంపారన్ నీలి మందు తోటల సాగుదారులైన రైతులను పలు రకాల పన్నుల పేరిట దోపిడి చేస్తున్న ఆంగ్లేయ ప్లాంటర్ల అకృత్యాలను, రైతుల బాధల గాధలను వృత్తిరీత్యా ఉపాధ్యాయుడైన పీర్ మహ్మద్ మునిన్ తన వార్తల ద్వారా ప్రథమంగా ప్రజల దృష్టికి తీసుకొచ్చారు.

1916లో జరిగిన జాతీయ కాంగ్రెస్ సమావేశంలో ఆయన గాంధీజీని స్వయంగా కలసి రైతుల ఇక్కట్లను వివరించారు. ఆ సమయంలో అక్కడి రైతులను సంఘటితపర్చి, ప్లాంటర్ల దుష్ట పన్నాగాలను ఎదుర్కొంటూ షేక్ మహమ్మద్ గులాబ్ అను యువకుడు రైతాంగ ఉద్యమాన్ని నడుపుతున్నారు.

ఆ రైతుల సమస్యలను పరిష్కరించేందుకు మహాత్మాగాంధీ చంపారన్ వెళ్ళారు. రైతుల పక్షాన విచ్చేసిన ఆయనను అంతం చేయాలని ప్లాంటర్లు కుట్ర పన్నారు. ఆ కుట్ర నిర్ణయం మేరకు ఆయనకు విషమిచ్చి చంపేందుకు మోతిహరి గ్రామానికి చెందిన బతఖ్ మియా అన్సారి అను చిరు ఉద్యోగిని భయపెట్టి బలవంతంగా ఒప్పించారు. మాట వినకుంటే ఆయన కుటుంబాన్ని నాశనం చేస్తామని బెదిరించటంతో అన్సారి అంగీకరించినట్టు నటించి అప్పటికి ఆ గండం నుండి బయటపడ్డారు.

ఆ తరువాత ప్లాంటర్ల ఆదేశాలను తుంగలో తొక్కి, విందు సమయంలో సూపులో విషం కలిపిన విషయాన్ని నేరుగా గాంధిజీకి తెలిపారు. ఆ సమయంలో డాక్టర్ బాబూ రాజేంద్ర ప్రసాద్ కూడా మహాత్ముని వెంట ఉన్నారు. ఆనాడు అన్సారి చూపిన ధైర్యం, తెగింపు ఆయనను ఆశ్చర్యచకితుల్ని చేశాయి.

ఆ తరువాత 1947లో స్వాతంత్ర్యం లభించింది. డాక్టర్ రాజేంద్ర ప్రసాద్ రాష్ట్రపతి అయ్యారు. ఆయన రాష్ట్రపతి హోదాలో 1950 సంవత్సరంలో మోతిహరి గ్రామం సందర్శించారు. ఆ సందర్భంగా ప్లాంటర్ల కుట్రకు చేయూతన్వక పోవటంతో ఉద్యోగం పోగొట్టుకుని, ప్లాంటర్ల చిత్రహింసలకు గురై అన్ని విధాల నష్టపోయి పేదరికం పొత్తిళ్ళలో కాలం గడుపుతున్న బతఖ్ మియా అన్సారిని ఆయన చూసారు.

1917 నాటి విషయాలను గుర్తుకు తెచ్చుకుని, అన్సారికి 50 ఎకరాల భూమిని ఇవ్వాల్సిందిగా రాష్ట్రపతి రాజేంద్ర ప్రసాద్ అధికారులను ఆదేశించారు. ఈ ఆదేశం అధికారుల సహజ అలసత్వం వలన 1957 ప్రాంతంలో, బతఖ్ మియా అన్సారి మరణించాక గాని అమలు జరగపోవటం విషాదం.

(స్వాతంత్ర్యసమరయోధులు సయ్యద్ ఇబ్రహీం ఫిక్రి చే విరచితమై భారత ప్రభుత్వం సహాయంతో 1999లో ప్రచురితమైన, 'హిందూస్తానీ ముసల్మానోం కా జంగ్- యే-ఆజాది మేం హిస్సా ' గ్రంథం పేజి 22-24)

## జలియన్ వాలాబాగ్ హీరో డాక్టర్ కిచ్లూ


డా॥ సైపుద్దీన్ కిచ్లూ

బ్రిటీష్ ప్రభుత్వం 1918లో రౌలట్‌చట్టం తీసుకొచ్చింది. ఈ చట్టాన్ని ప్రధానంగా ముస్లింలపై దమనకాండకు గురిపెట్టింది. ప్రభుత్వ దమన నీతిని గమనించిన మహాత్మాగాంధీ బ్రిటీష్ శాసనాలను ఉల్లంఘించమని ప్రజలకు పిలుపు నిచ్చారు.

ఈ సందర్భంగా హిందూ-ముస్లింలు పెద్ద సంఖ్యలో ప్రతిజ్ఞలు చేశారు. ప్రతిజ్ఞాపత్రాల మీద తొలిగా సంతకాలు చేసిన వారిలో హకీం అజ్మల్ ఖాన్, జస్టిస్ అబ్బాస్ తయ్యాబ్జీ, ఉమర్ సుభాని, డాక్టర్ యం.ఎ. అన్సారి, చౌదరి ఖలీఖుల్ జమా, మౌలానా

అబ్దుల్ బారి, మౌలానా హసరత్ మోహని, యాకూబ్ ఖాన్ తదితరులున్నారు.

రౌలట్ చట్టానికి వ్యతిరేకంగా గాంధీజీ సత్యాగ్రహ ఉద్యమానికి పిలుపు నిచ్చారు. ఢిల్లీలో తొలి సత్యాగ్రహ సభ ఏర్పడింది. ఈ సభకు డాక్టర్ యం.ఎ. అన్సారి, డాక్టర్ అబ్దుల్ రహమాన్ అధ్యక్ష కార్యదర్శులుగా వ్యవహరించారు. ఈ నేతల నాయకత్వంలో ఆక్కడ హర్తాల్ జరిగింది. **మార్చి 30న ఢిల్లీలో జరిగింది. స్వామి శ్రద్ధానంద, హకీం అజ్మల్ ఖాన్‌ల మాట అక్కడ ఆజ్ఞ... అటువంటి హర్తాల్ ఢిల్లీలో ఎప్పుడూ జరగలేదు,** అని మహాత్మా గాంధీ తన ఆత్మకథలో రాసుకున్నారు. (The Story of My Experiment with Truth, MK Gandhi, Page 423-424)

ఈ మేరకు సత్యాగ్రహ ఉద్యమం శాంతి యుతంగా జరుగుతున్నా సహించలేక పోయిన ప్రభుత్వం ఉద్యమకారుల మీద కాల్పులు జరిపింది. పంజాబులో సత్యాగ్రహనేతలు జలియన్‌వాలాబాగ్ హీరోగా ఖ్యాతిగాంచిన డాక్టర్ సైఫుద్దీన్ కిచ్లూ, ఆయన సహచరులు డాక్టర్ సత్య పాల్‌లను ద్వీపాంతరవాస శిక్షకు గురిచేసినందున ఆగ్రహించిన ప్రజలు జలియన్‌వాలాబాగ్‌లో సమావేశమయ్యారు.

ఈ సమావేశాన్ని విచ్ఛిన్నంచేయ సంకల్పించిన జనరల్ డయ్యర్ విచక్షణా రహితంగా సభికులపై కాల్పులు జరిపి వందలాది దేశభక్తులను పొట్టనపెట్టుకున్నాడు. అమరవీరుల్లో ముస్లింల చాలా మంది ఉన్నారు. ప్రభుత్వ లెక్కల ప్రకారం 378 మంది ఈ దుస్సంఘటనలో ప్రాణాలు పోగొట్టుకోగా, ఆ అమర యోధులలో 55 మంది ముస్లింలు ఉన్నారు.

అమృతసర్ జిల్లా దుల్లా గ్రామానికి చెందిన 50 ఏండ్ల వయస్కురాలైన **ఉమర్ బీబి** అను మహిళ కూడా జనరల్ డయ్యర్ సైనికుల తుపాకి గుళ్ళకు ప్రాణాలు అర్పించి ఆనాటి అమరయోధుల జాబితాలో స్థానం పొందటం విశేషం.

## హిందూ-ముస్లింల ఐక్యతకు చిహ్నం 'ఖిలాఫత్'

బ్రిటీష్ ప్రభుత్వం 'ఖలీఫా' పదవిని రద్దు చేసేందుకు ప్రయత్నించటంతో, అందుకు నిరసనగా ఆరంభమైన ప్రపంచవ్యాపిత ఉద్యమంలో భాగంగా భారతీయ ముస్లింలు ఖిలాఫత్ ఉద్యమానికి సన్నద్ధులయ్యారు. బ్రిటీష్ సామ్రాజ్య కాంక్షకు వ్యతిరేకంగా ఉద్యమించేందుకు, హిందూ-ముస్లింల ఐక్యతను పటిష్టపర్చేందుకు ఇది చక్కని



**జగద్గురు శ్రద్ధానందతో అలీ సోదరులు, కిచ్లూ**

**అవకాశంగా భావించిన గాంధీజీ 1920లో ఖిలాఫత్ ఉద్యమంలో పాల్గొనమని పిలుపునిచ్చారు.**

ఆ పిలుపునందుకున్న హిందూ-ముస్లింలు ఒక్కటై బ్రిటీష్ ప్రభుత్వంపై విరుచుకుపడ్డారు. హిందూ-ముస్లింల ఐక్యతకు చిహ్నంగా కలకాలం నిలచిపోయే ఈ ఉద్యమం అనేక అనుకూల పరిణామాలకు కారణమైంది. ఈ ఉద్యమం సందర్భంగానే అలీ సోదరులుగా ఖ్యాతిగాంచిన ముహమ్మద్ అలీ, షౌకత్ అలీ సోదరులతో కలసి గాంధీజీ భారత దేశ పర్యటన గావించారు. జాతీయ ముస్లిం విశ్వవిద్యాలయమైన **జామియా మిల్లియా ఇస్లామియా** ఆవిర్భవించింది. ఖిలాఫత్ ఉద్యమంలో భాగంగానే గాంధీజీ సహాయ నిరాకరణోద్యమానికి శ్రీకారం చుట్టారు.

జాతీయ భావాలను పటిష్టపర్చిన ఈ ఉద్యమం ఫలితంగా బ్రిటీష్ సైన్యంలో పనిచేస్తూన్న భారతీయ సైనికులు, అధికారులు తమ ఉద్యోగాలు, పదవులు త్యజించి బయటకొచ్చేశారు. ఈ సందర్భంగానే **'ముస్లింలు బ్రిటీష్ సేవలో గడపటం, ధర్మ విరుద్ధమంటూ'** ఉలెమాలు ప్రకటించారు. సహాయ నిరాకరణ, శాసనోల్లంఘనలను పాటించాల్సిందిగా మౌలానా ముహమ్మద్ అలీ తదితర ప్రముఖ నేతలు ప్రజలకు పిలుపునిచ్చారు. ఆ పిలుపునకు స్పందించి హిందూ-ముస్లిం నేతలు ఒక సంయుక్త ప్రకటన విడుదల చేశారు. ఈ ప్రకటనపై మౌలానా అజాద్ తదితర ప్రముఖులు సంతకాలు చేయగా 1921లో జాతీయ కాంగ్రెస్ ఈ ప్రకటనను ఆమోదించింది.


హకీం అజ్మల్ ఖాన్

ఈ ఉద్యమంలో ప్రధానంగా ఆలీ సోదరులుగా ఖ్యాతిగాంచిన మౌలానా ముహ్మద్ అలీ, మౌలానా షౌకత్ అలీ, మౌలానా అజాద్, ఆయన విప్లవోద్యమ సహచరుడు అక్రం ఖాన్, డాక్టర్ అన్సారి, డాక్టర్ జాకీర్ హుస్సేన్, రఫీ అహ్మద్ కిద్వాయ్, హకీం అజ్మల్ ఖాన్, మజహరుల్ హక్, ప్రొఫెసర్ ముజీబ్, తమిళనాడుకు చెందిన అబ్దుల్ రహీం, కేరళకు చెందిన ముహమ్మద్ మూసా, అబ్దుల్లా హాజీ, హైదరాబాద్‌కు చెందిన అక్బర్ అలీఖాన్, మీర్ ముహమ్మద్ హుస్సేన్, అబ్దుల్ సుభాన్, అమీర్ అహమ్మద్, సయ్యద్ ముహమ్మద్ అన్సారి, మక్బూల్ అలీ, అతావుల్లా షా బుఖారి, హాజీ ఇమ్‌దాదుల్లా హజిర్, విజయవాడకు చెందిన గులాం మొహిద్దీన్ సాహెబ్ తదితరులు ముఖ్య పాత్ర ధారులయ్యారు.

ఈ సందర్భంగా హిందూ సోదరులు కొందరు పలు అనుమానాలను వ్యక్తం చేస్తూ రావటంతో, ఆ అనవసర భయాల ప్రచారాన్ని నిరోధించేందుకు మౌలానా అజాద్ పూనుకున్నారు. ఈ అనుమానాల నేపథ్యంలో, ప్రపంచంలోని ఏ ముస్లిం దేశమైనా **మన దేశాన్ని ఆక్రమించ చూస్తే, ఈ దేశపు చివరికి ముస్లిం వరకు పోరాడుతారు.. ఖలీఫా గాని మరే ఇతర ఆక్రమణ దారుడు గాని మన దేశం వైపు కన్నెతి చూసినా ఆ శక్తుల నుండి దేశాన్ని రక్షించుకోవటం ముస్లింల ప్రధాన కర్తవ్యమని ఇస్లాం ఆదేశిస్తుందని,** ఆయన ప్రకటించారు.

( '..the Mussalmans of India will fight to the least man in resisting any Musslaman power that may designs upon India... it is the injection of Islam that the Muslims should protect their country from invaders, irrespective of whether the invaders are Muslim or even the army of the Calipha him self...' - Freedom Movement and Indian Muslims, Santimoy Ray, PPH, New Delhi, 1983, Page 50)


డా॥ ఎం.ఎ. అన్సారి


ఆబాది బేగం బానో

బక్రీద్ పర్వదినం సందర్భంగా గోవులను ఖుర్బాని ఇవ్వాల్సిన అవసరం లేదని మౌలానా మజ్రుల్ హఖ్ వెల్లడించారు. సహాయ నిరాకరణో ద్యమంలో భాగంగా విద్యార్థులు కళాశాలను వదిలేశారు. ఆ విద్యార్థుల కోసం జాతీయ ముస్లిం విద్యాలయమైన జామియా మిల్లియా ఇస్లామియా 1920 అక్టోబరులో ఆవిర్భవించింది.

ఈ ఉద్యమంలో పురుషులతోపాటుగా ముస్లిం మహిళలు కూడా మాతృదేశం కోసం త్యాగాలు చేయడంలో తామెవ్వరికి తీసిపోమంటూ రంగం మీదకు వచ్చారు. **నా దేశంలోని కుక్కలు పిల్లులు కూడా బ్రిటీష్ బానిసత్వపు సంకెళ్ళల్లో బంధీలుగా ఉండరాదన్నది నా అభిమతం**, అని గర్జించిన ఆబాది బేగం బానొ, సంపూర్ణ స్వరాజ్యం ప్రతిపాదనను తిరస్కరించిన గాంధీజిని విమర్శించి, ఆ తరువాత ఆయనచేత కూడా శభాష్ అన్పించుకున్న బేగం నిషాతున్నీసా మోహాని, అంజాది బేగం, అక్బరి బేగం, అమీనా తయ్యాబ్జి, షఫాతున్నీసా బేగం, ఫాతిమా ఇస్మాయిల్, బీబీ అముత్సలాం లాంటి మహిళలెందరో ఖిలాఫత్ - సహాయ నిరాకరణ ఉద్యమంలో ప్రధాన పాత్రధారులయ్యారు.

ఈ మహిళలలో కొందరు భర్తలను ప్రోత్సహిస్తే మరికొందరు అరెస్టయిన భర్తల స్థానంలో ఉద్యమ భాధ్యతలు నిర్వహించారు. రచనలతో కొందరు, ప్రసంగాలతో మరికొందరు, అస్తిపాస్తులను జాతీయోద్యమ వ్యాప్తికి, ఉద్యమించి శిక్షలకు గురైన ఉద్యమకారుల కుటుంబాలను ఆదుకునేందుకు ధారాళంగా వినియోగించిన వారూ ఉన్నారు. అపూర్వమైన త్యాగాలతో ప్రజల గౌరవాభిమానాలు పొందటమే కాకుండా, **ఆమె సమక్షాన శ్రద్ధాభావనతో నా శిరస్సు వంచాను**, అని గాంధీజీచే గౌరవాభిమానాలు పొందిన బేగం షంషున్నిసా అన్సారి లాంటి మహిళామతల్లులూ ఉన్నారు.

## 'సంపూర్ణ స్వరాజ్యం' హసరత్ మోహానీ కల

జాతీయోద్యమంలో **చిచ్చర పిడుగు** గా ప్రసిద్ధుడైన మౌలానా హసరత్ మోహాని 1921 నాటి అహమ్మదాబాద్ కాంగ్రెస్ సమావేశంలోనే **సంపూర్ణ స్వరాజ్యం** ప్రతిపాదన ప్రవేశపెట్టారు. ఈ ప్రతిపాదనను ఆయన ఎప్పటి నుండో తన పత్రిక URDU-E-




MOALLA ద్వారా ప్రజలలో చర్చకు పెడుతున్నారు. సంపూర్ణ స్వరాజ్యం ప్రతిపాదనకు అనుకూలంగా మౌలానా చేసిన ప్రసంగం గాంధీజిని కూడా కలవ రానికి గురిచేసింది.

ఈ విషయాన్ని గాంధీజి తన **ఆత్మకథలో** ప్రత్యేంగా రాసుకున్నారు. **'ఆయన ప్రసంగం సభికులను బాగా ఆకట్టుకుంది. నా వాదన అరణ్యరోదన కాగలదని భయపడ్డాను. నాకు నేను ధైర్యం కూడగట్టుకుని..మాట్లాడలిచాను'** అన్నారు.

(Hasrath Mohani's speech had **been received whit such loud** acclamations that I was afraid that mine would only be a cry in wilderness. I had made bold to speak...' (The Story of My Experiment with Truth, MK Gandhi, Page. 442)

1921 నుండి మౌలానా పోరాడుతున్నా 'సంపూర్ణ స్వరాజ్యం' ప్రతిపాదనను గాంధీజీ ఒత్తిడి వలన తీర్మానంగా కాంగ్రెస్ ఆమెదించక పోవటం, తన విప్లవాత్మక భావాల పట్ల తరచుగా వ్యక్తమవుతున్న వ్యతిరేకత వలన విసిగిన ఆయన 1928లో కాంగ్రెస్ నుండి బయటకు వచ్చారు. 1929 అక్టోబరు 31 నాటి లాహోర్ సమావేశంలో మౌలానా కల పూర్తిగా నిజమైంది. సంపూర్ణ స్వరాజ్యం ప్రతిపాదన తీర్మానంగా రూపుదిద్దుకుంది.

మౌలానా హస్రత్ మోహాని వాదనా పటిమ గురించి టర్కీకి చెందిన రచయిత్రి Halide Eidb తో 1937 లో మహాత్మాగాంధీ మాట్లాడుతూ ' ..when I have a talk with Mohani, I can not sleep in peace..' అన్నారంటే మౌలానా వాదన ఏ స్థాయిలో ఉండేదో, అది మహాత్ముడ్ని ఏ మేరకు డిస్టర్బ్ చేసేదో, మరేమేరకు ప్రభావితం చేసేదో ఊహించవచ్చు.

## మలబార్ మోప్లాల విజృంభణ

బ్రిటీష్ పాలకులకు తొత్తులుగా వ్యవహరిస్తూ ప్రజలను, రైతాంగాన్ని పీడిస్తూన్న జమీందారుల అకృత్యాలను,1800 నుండి సాయుధులై ఎదుర్కొంటూ, ఆత్మ త్యాగాలకు సిద్ధపడిన సుదీర్ఘ చరిత్రగల కేరళ రాష్ట్రంలోని మలబారు మోప్లాలు, ఖిలాఫత్- సహాయ

నిరాకరణ ఉద్యమంలో మౌలీ అలీ ముస్లలియార్ నేతృత్వంలో ప్రత్యేక పాత్ర పోషించారు. శాంతియుతంగా గాంధేయ మార్గంలో పయనిస్తున్న మోప్లాలను రెచ్చగొట్టటంతో తిరగబడిన మోప్లాల ధాటికి తట్టుకోలేక బ్రిటీష్ అధికారులతో సహా పోలీసు బలగాలు పలాయనం చిత్తగించాయి.

ఆ అనుకూల వాతావరణంలో మోప్లాలు తమదైన రీతిలో ప్రజాపాలనను ఏర్పాటుచేసుకుని కొత్త చరిత్ర సృష్టించారు. అయితే మోప్లాల చేతిలో పరాభవాన్ని ఎదుర్కొన్నందున, కసిపెంచుకున్న బ్రిటీషు సైనిక, పోలీసు బలగాలు ఆ తరువాత గ్రామాల మీద విరుచుకపడి సాగించిన మారణకాండకు వందలాది మోప్లాలు బలయ్యారు.

ఈ సందర్భంగానే **బళ్ళారి రైలు విషాదంతంగా** పేర్కొనబడిన ట్రైను ట్రాజడీ జరిగింది. అతి చిన్న రైలు వ్యాగన్‌లో 127 మంది మోప్లాలను బలవంతంగా కుక్కి వ్యాగన్‌లోకి గాలి కూడా చొరబడకుండా సీలు చేసి, తిరూరు జైలు నుండి సుదూరాన ఉన్న బళ్ళారి జైలుకు పంపుతుండగా, కోయంబత్తూరుకు వచ్చేసరికి 70 మందికి పైగా మోప్లాలు ఊపిరాడక రైలు వ్యాగన్‌లో మరణించారు. ఈ పోరాటంలో 252 మందిని సైనికులు కాల్చివేయగా, 500 మందికి యావజ్జీవిత కారాగార శిక్ష విధించారు. మౌల్వీ కున్‌యి ఖాదర్, మౌల్వీ అలీ ముస్లలియార్ లతో పాటు పలువురికి ఉరిశిక్షలు కూడా పడ్డాయి. ఈ ఉద్యమంలో మహమ్మద్ అబ్దుల్ ర్రహ్మాన్ సాహెబ్, మౌల్వీ ఖాదర్ మొహిద్దీన్, మొహిద్దీన్ కోయా తదితరులు ప్రముఖ పాత్రవహించారు.

## అగ్నియుగం ద్వితీయ ఘట్టం

ఖిలాఫత్, సహాయనిరాకరణ, శాసనోల్లంఘన ఉద్యమాల తీవ్రతను చూసిన, భారతీయుల ఐక్యతను గమనించిన బ్రిటీష్ ప్రభుత్వం రెచ్చి పోయింది. ప్రజలను తీవ్ర నిర్బంధాలకు గురిచేసింది. పోలీసులను ఉసిగొల్పి దమనకాండకు పాల్పడింది. ఆగ్రహావేశపరులైన ప్రజలు ఉత్తరప్రదేశ్‌లోని చౌరీచౌరాలో పోలీసు స్టేషన్‌ను తగులబెట్టారు. ఈ సంఘటనలో పలువురు పోలీసులు మృతి చెందటంతో గాంధీజీ శాసనోల్లంఘన ఉద్యమాన్ని అకస్మాత్తుగా విరమింపజేశారు. మహాత్ముడు ఉద్యమాన్ని ఆకస్మికంగా విరమించటంతో ఉద్యమిస్తున్న నేతలు, ప్రజలు ప్రధానంగా విప్లవ భావాలు గల యువత నిరసన వ్యక్తం చేశారు. ఆ నిరసన నుండి విప్లవోద్యమం ద్వితీయ ఘట్టం రూపుదిద్దుకుంది.

శాసనోల్లంఘన ఉద్యమాన్ని పురస్కరించుకుని బ్రిటీష్ ప్రభుత్వం మహాత్మాగాంధీని 1930 మేలో అరెస్టు చేసింది. ఈ అరెస్టుకు వ్యతిరేకంగా ప్రజానీకంలో ఆగ్రహావేశాలు పెల్లుబికాయి. ఈ సందర్భంగా షోలాపూర్‌కి చెందిన కార్మికులు పెద్ద ఎత్తున నిరసన వ్యక్తం చేశారు. ఆ కార్మికులపై బ్రిటీష్ ప్రభుత్వం కన్నెర్ర చేసింది. అనేకమందిని అరెస్టు చేసి జైళ్ళల్లో కుక్కింది. నిరసనోద్యమ నేతలపై విచారణ జరిపి ఉరిశిక్షలు విధించింది. ఈ యోధులలో అబ్దుల్ రషీద్, ఖుర్బాన్ హుస్సేన్‌లున్నారు. దయాభిక్ష కోసం దరఖాస్తు చేసుకోవల్సిందిగా మిత్రులు ఒత్తిడి తెచ్చినప్పటికి, ఆ ప్రతిపాదనలను తిరస్కరించి ఆ యోధులు ఉరిశిక్షలను స్వీకరించారు.

## అష్ఫాఖుల్లా ఖాన్ బలిదానం

ఉద్వేగంగా ప్రారంభమైన శాసనోల్లంఘన ఉద్యమం ఊపు అందుకోక ముందే ముగిసింది. ఈ విరమణ నిర్ణయం పలు విమర్శలకు గురైంది. సంపూర్ణ **స్వరాజ్య** సాధనకు విప్లవ మార్గం మినహా మరో దారి లేదని భావించిన విప్లవ గ్రూపులు తిరిగి విజృంభించేందుకు ప్రేరణ కల్పించింది. దీనితో అగ్నియుగం **మలిదశ ప్రారంభమైంది.**



సంపూర్ణ స్వరాజ్యాన్ని సాధించేందుకు ఆయుధం పట్టడం తప్ప మరోమార్గం లేదని భావించిన అష్ఫాఖుల్లా ఖాన్ లాంటి యువకులు **హిందూస్థాన్ రిపబ్లికన్ అసోసియేషన్ లాంటి** విప్లవకారుల సంస్థలలో భాగస్వాములయ్యారు. ఈ సంస్థ ఆధ్వర్యంలో జరిగిన కాకోరి జైలు సంఘటనలో ఆయన పాత్రధారి. ఉరిశిక్షలు తప్పని ఈ కేసులలో అసోసియేషన్ నాయకుడు రాంప్రసాద్ బిస్మిల్‌ను రక్షించేందుకు, ఆరోణలను అంగీకరిస్తూ, పూర్తి నేరాన్ని తన నెత్తిన వేసుకుంటూ ఉన్నత న్యాయస్థానానికి అష్ఫాఖుల్లా లేఖ రాశారు. సమాజంలోని అర్థిక, సాంఘిక అసమానతలన్నీ తొలగిపోయి సమసమాజం ఏర్పడాలని బలంగా కాంక్షించారు. ఈ మేరకు తన అభిప్రాయాలకు ఆయన అక్షర రూపం కల్పించారు. చివరకు ఈ కేసులో ఆయనకు ఉరిశిక్ష విధించారు.

ఆ ఉరిశిక్ష అమలుకు ముందురోజున ఆయనను చూడటానికి వచ్చి, జైలులో విలపిస్తున్న బంధువులతో మాట్లాడుతూ, '..if I am not allowed to observe the last ceremony of the noblest ordeal with all dignity and steadiness then the sanctity of the occasion will be tarnished. A sacred and great responsibility for the liberation of motherland has been entrusted to me. You should feel happy and proud that one of yours is fortunate enough to offer his...To me this is a good fortune that belonging to the Muslim community, I have acquired the privilege of following the footsteps of those great martyrs..' (- Freedom Movement and Indian Muslims, Santimoy Ray, PPH Delhi, 1883 Page. 43) అన్నారు.

1927 డిసెంబర్ 19న ఉరి తీస్తారనగా, 27 సంవత్సరాల ఆ యువకుడు దేశ ప్రజలనుద్దేశించి రాసిన ఓ లేఖలో, **'..మీరు ఏ మతానికి, సంప్రదాయానికి చెందినవారైనా సరే దేశసేవలో సహరించండి. వృధాగా పరస్పరం కలహించకండి. ఒకవేళ దారులు వేరైనా అందరి లక్ష్యం ఒకటే. అన్ని పనులు ఒకే లక్ష్యాన్ని సాధించేందుకు సాధనాలు. అలాంటప్పుడు ఈ వ్యర్థపు కొట్లాటలూ, కుమ్ములాటలు ఎందుకు? ఐకమత్యంతో దేశంలోని దొరతనాన్ని ఎదిరించండి. దేశాన్ని స్వతంత్రం చేయండి..'** అన్నారు.

చివరకు **నా మాతృభూమి నిత్యం స్వతంత్రంగా ఉండాలి. నాదేముంది నేను ఉండొచ్చు ఉండకపోవచ్చు** అంటూ మాతృభూమి సౌభాగ్యాన్ని అనుక్షణం కాంక్షిస్తూ అమరలోకాలకు వెళ్ళిపోయారు.('..Hamara watan rahe sadaa khayam aur aajad, Hamara kya, ham rahe, rahe, narahe..' ).

ఈ సందర్భంగా, **ఒక ముస్లిం యువకుడిలా అమరుడయ్యే అవకాశం రావడం, ఆ సౌభాగ్యం నాకే కలగడం నిజంగా ఎంతో గర్వకారణం** అని అన్నారు. (బిస్మిల్ ఆత్మకథ, శ్రీరాంప్రసాద్ బిస్మిల్, అనువాదంః ఇంగువ మల్లికార్జున శర్మ, మార్కిస్టు అధ్యయన వేదిక, హైదరాబాదు, 1989, పేజి153)

అగ్నియుగం రెండవ దశలో జుగాంతర్ పార్టీకి చెందిన మౌల్వీ గయాజుద్దీన్, నశీరుద్దీన్ అహ్మద్, అబ్దుల్ ఖాదిర్, అనుశీలన పార్టికి చెందిన అల్తాఫ్ అలీ, మహమ్మద్ ఇస్మాయిల్, జహీరుద్దీన్ తదితర విప్లవకారులు ఎందరో పలు ప్రాంతాలలో విస్ఫులింగాలై విజృంభించారు.

## మన్యం పోరులో రాజు అండగా నిలచిన ఫజులుల్లా ఖాన్

ఆంధ్ర ప్రదేశ్‌లో 1922-24 లో జరిగిన మన్యం పోరాటానికి నాయకత్వం వహించిన అల్లూరి సీతారామరాజుకు డిప్యూటీ కలక్టర్ ఫజులుల్లా ఖాన్ ప్రేరణగా నిలిచారు. ఆయన రాజు తండ్రి స్నేహితులు. ఆ కారణంగా పుత్రవాత్సల్యంతో బ్రిటీష్ ప్రభుత్వంలో ఉన్నతాధికారి అయిఉండి అరవై ఎకరాల భూమి కేటాయించిన ఫజులుల్లా ఖాన్ శ్రీ రాజుకు సహకరించారు. ఈ విషయాలు 1930లో రాసిన ' అల్లూరి సీతారామరాజు ' లో ఆ పుస్తక రచయిత శ్రీ పొన్నలూరి రాధాకృష్ణమూర్తి పేర్కొన్నారు. ఆ విషయాలను విస్తారంగా రాస్తూ, '.. **యా భానుని ( అల్లూరి ) తీవ్ర గమనమునకు రధ సారధ్యమును వహించవలసిన శ్రీయుత ఫజులుల్లా ఖాను గారు మృత్యుశయ్య పైనున్నారు.... పిదప అనతికాలంలోనే ఖానుగారు స్వర్గస్తులైరి...ఖానుగారు మరి కొంతకాలం జీవించియున్నచో ఆయన కంఠానికి ఉరిబెట్టి ప్రభుత్వము (బ్రిటీషు ప్రభుత్వం) తన ఆగ్రహమును లోకమునకు ప్రకటించేది..ఇంతకు ఫజులుల్లా ఖాను దేశభక్తి మరుగున పడినది..**', అని శ్రీ పొన్నలూరి పేర్కొన్నారంటే, అల్లూరి పితూరిలో ఫజులుల్లా ఖాన్ భాగస్వామం ఎటువంటిదో గ్రహించవచ్చు. ఏ కారణంగానో జనాబ్ ఫజులుల్లా ఖాన్ పాత్ర తగినంత ప్రచారానికి నోచుకోలేదు.

ఈవిధంగా సాగిన సాయుధ పోరాటాలలో జుగాంతర్ పార్టీకి చెందిన మౌల్వీ గయాజుద్దీన్ అహమ్మద్, నశీరుద్దీన్ అహమ్మద్, ఆయన కుమార్తె రజియా ఖాతూన్, అబ్దుల్ ఖాదీర్, అనుశీలన పార్టీకి చెందిన అల్తాఫ్ అలీ, ముహమ్మద్ ఇస్మాయిల్, జహీరుద్దీన్ తదితరులు ఆయా విప్లవ పార్టీలలో బాధ్యులుగా ప్రముఖ పాత్ర వహించారు.

## స్వరాజ్య పార్టీ నిర్మాణంలో భాగస్వామ్యం

ఆ సమయంలో రాజకీయరంగాన ఏర్పడిన పరిస్థితిని సమీక్షించేందుకుగాను హకీం అజ్మల్ ఖాన్ అధ్యక్షతన విచారణ కమిటీ ఏర్పాటయ్యింది. విచారణానంతరం 1919 రాజ్యాంగం ప్రకారం ఎన్నికలలో పాల్గొనాలని ఒక వర్గం, అవసరం లేదని మరొక వర్గం అభిప్రాయపడటంతో చీలిక ఏర్పడింది. ఈ చీలిక పండిత మోతీలాల్ నెహ్రూ నాయకత్వంలో **స్వరాజ్య పార్టీ** నిర్మాణానికి కారణమయ్యింది. ప్రముఖ ముస్లిం నాయకులు హకీం అజ్మల్ ఖాన్ పార్టీ వ్యవస్థాపకులలో ఒకరయ్యారు. ఈ పార్టీ

రాజకీయంగా ముందుకు సాగటం, ఆ తరువాత జరిగిన ఎన్నికలలో పాల్గొనటం తదితర సంఘటనలు జరిగాయి. అనంతర కాలంలో ఐక్యతను ఆశిస్తున్న మౌలానా అబుల్ కలాం అజాద్ అధ్యక్షతన 1923లో ఢిల్లీలో జరిగిన కాంగ్రెస్ ప్రత్యేక సమావేశంలో ఈ సమస్య పరిష్కారం కావటంతో భారత జాతీయ కాంగ్రెస్ ప్రమాదం నుండి బయటపడింది.

## సైమన్ గోబ్యాక్ ఉద్యమం

1927 మద్రాసు సమావేశంలో సైమన్ కమిటి బహిష్కరణ నిర్ణయం జరిగింది. ఆ సందర్భంగా సైమన్ గోబ్యాక్ అంటూ బొంబాయి ప్రజలు నినదించారు. ఈ సందర్భంగా జరిగిన భారీ ప్రదర్శనకు యువ నాయకుడు యూసుఫ్ మోహరాలి నాయకత్వం వహించారు.


యూసుఫ్ మోహరాలి

భారత దేశం మొత్తాన్ని కదిలించిన ఆ ప్రదర్శనలో , 'The British Rulers are like dogs. If you kick them, they will lick you. But if you lick them, they will kick you.(Yusuf Meharally by Madhu Dendavate, NBT, India, 1986. Page103 ) అని పరాయి పాలకుల కుటిల నైజాన్ని ప్రకటిస్తూ, ఉద్యమించినట్టయితే, ఆంగ్లేయ ప్రభుత్వం తోకముడిచి పారిపోగలదని, అందువలన ఉద్యమించాల్సిందిగా ఆయన ప్రజలకు, ప్రధానంగా యువతకు పిలుపునిచ్చారు.

బ్రిటీషు ప్రభుత్వం విధివిధానాలను ఎద్దేవా చేస్తూ ప్రకటనలు ఇవ్వటమే కాకుండా ప్రత్యేకంగా తాను తయారు చేయించిన పోస్టర్లను యూసుఫ్ మెహర్ అలీ బోంబాయిలో ప్రదర్శించి సంచలనం సృష్టించారు. ఈ చర్యలతో ప్రభుత్వం మండిపడగా, యువకులు మాత్రం ఆయనను ఆదర్శంగా తీసుకున్నారు.

## చిట్టగాంగ్ వీరులకు చేయూత

విప్లవయోధులు చేస్తున్న వ్యక్తిగత బలిదానాలకు భిన్నంగా ఒక పద్ధతి ప్రకారంగా బ్రిటీష్ పాలకుల వ్యవస్థ మీద పలుదాడులు జరుపుతూ 3 సంవత్సరాలపాటు విప్లవించిన వీరులుగా చిట్టగాంగ్ విప్లవకారులు ఖ్యాతిగాంచారు. 1929 నుండి 1933 వరకు

సాగిన ఈ పోరాటానికి సూర్యసేన్ నాయకులు. పశ్చిమ బెంగాల్‌లోని చిట్టగాంగ్ కేంద్రంగా, బ్రిటీష్ పాలకుల మీద విరుచుకుపడిన ఈ యోధులలో సత్తార్, మీర్ అహమ్మద్, ఫకీర్ అహమ్మద్ మియా తదితరులు ప్రముఖులు. బ్రిటీష్ పోలీసుల డేగ కళ్ళ నుండి తప్పించుకుంటూ, పథకం ప్రకారంగా అదను చూసి బ్రిటీష్ పోలీసులను, సైనికులను దెబ్బతీస్తూ చిట్టగాంగ్ వీరులు తమ పోరు సాగించారు.

బ్రిటీషు ప్రభుత్వం పటిష్టమైన ఇంటిలిజెన్సీ వ్యవస్థ కలిగియున్నప్పటికీ చిట్టగాంగ్ వీరుల చర్యలను పసిగట్టి నివారించలేకపోయింది. బ్రిటీష్ ప్రభుత్వ వైఫల్యానికి ప్రధాన కారణం, ఆ ప్రాంతపు ముస్లిం రైతాంగ, పేద వర్గాల ప్రజానీకం విప్లవకారులను కడుపులో పెట్టుకుని కాపాడటమే! విప్లవకారులకు ఆశ్రయం కల్పించటమేకాక, ఆహారం అందిస్తూ, బ్రిటీష్ పోలీసుల కదలికలను రైతు కుటుంబాల బాలబాలికలు విప్లవకారులకు తక్షణమే చేరవేసేవారు. అంతే కాకుండా ముస్లిం యువకులు విప్లవకారులకు రక్షణగా సంచరిస్తూ గమ్యస్థానాలకు చేర్చేవారు.

1933 ఫిబ్రవరిలో చిట్టగాంగ్ విప్లవకారుల నేత సూర్యసేన్ అరెస్టయ్యేంత వరకు సాగిన ఈ పోరు చరిత్రలో తనదైన స్థానాన్ని స్వంతం చేసుకుంది. సూర్యసేన్‌ను అరెస్టు చేసిన బ్రిటీష్ పాలకులు ఆయనను 1934 జనవరిలో ఉరితీశారు. ఆయనను అరెస్టు చేశాక దిగాలు పడిపోయిన ముస్లిం రైతు కుటుంబాలు, ఆయనను ఉరితీశాక వారాల తరబడి అన్నపానాలు మాని విలపించాయి.

ఈ విప్లవ నేతలంతా బ్రిటీష్ ప్రభుత్వ క్రూరత్వానికి బలైపోయారు. నేతలు ద్వీపాంతరవాస శిక్షలు, కాల్చివేతలు, ఉరిశిక్షలకు గురికావటంతో అగ్ని యుగం ముగిసింది. ఇంకా మిగిలియున్న నాయకులు కార్యకర్తలలో పలువురు భారత జాతీయ కాంగ్రెస్ మార్గాన్ని స్వీకరించటంతో ఆత్మబలిదానాలతో ఎరుపెక్కిన విప్లవ యుగం ముగిసింది.

## సామ్యవాదంతో ప్రభావితమై త్యాగాలకు ముందడుగు

బ్రిటీష్ ప్రభుత్వాన్ని సాయుధ పోరాటం ద్వారా మాత్రమే భారతదేశం నుండి వెళ్ళగొట్టగలమని భావించిన విప్లవకారులంతా ఆ తరువాతి కాలంలో కమ్యూనిజం పట్ల ఆకర్షితులయ్యారు. కమ్యూనిస్టు సిద్ధాంతాలతో ప్రేరణ పొందిన ఈ యువకులు, కార్మిక రైతాంగ ఉద్యమాలలో చురుగ్గా పాల్గొన్నారు.


అమీర్ హైదర్ ఖాన్

రష్యా ప్రజలు నిరంకుశ జార్ చక్రవర్తి మీద సాధించిన అద్భుత విజయంతో సామ్యవాద సిద్ధాంతాల పట్ల ఆకర్షితులైన యువకులు కార్మిక-కర్షక జనావళిని చైతన్యవంతులను గావించి అన్నివర్గాల ప్రజలను జాతీయోద్యమంలో భాగస్వాములు చేయాలన్న సంకల్పంతో ముందుకు కదిలారు.

ఈ నేపథ్యంలో దక్షణ భారతదేశానికి కమ్యూనిజాన్ని పరిచయం చేసి,పెషావర్‌లో జన్మించిన అమీర్ హైదర్ ఖాన్ ఆంధ్ర ప్రదేశ్ చెందిన ప్రముఖ కమ్యూనిస్టు నాయకులు శ్రీ కంభంపాటి సీనియర్, శ్రీ సుందరయ్యలను స్వయంగా ఆనాడు పార్టీ ప్రవేశం చేయించారు. ఖిలాఫత్ ఉద్యమం సందర్భంగా, స్వదేశం పరాయిపాలకుల బానిసత్వం క్రింద ఉన్నందున ఆఫ్ఘనిస్తాన్‌కు భారీ సంఖ్యలో వలస వెళ్ళడానికి విఫల ప్రయత్నం చేసిన కొందరు అటునుండి రష్యా వెళ్ళారు. అక్కడ సామ్యవాద భావాల పట్ల ఆకర్షితులై, ఆయా సిద్ధాంతాలను అధ్యయనంగావించిన పలువురు, ఆ భావాలను ప్రచారం చేస్తూ, కార్మికులను బ్రిటీష్ సామ్రాజ్యవిస్తరణ కాంక్షకు వ్యతిరేకంగా ఉద్యమింపచేయ ప్రయత్నించారు. అటువంటి ప్రముఖులలో షౌకత్ ఉస్మాని, డాక్టర్ జైనుల్లాబిద్దీన్, ఆయన భార్య హజరా బేగం, కాకా బాబుగా ఖ్యాతిగాంచిన ముజఫర్ అహమ్మద్, డాక్టర్ మహ్మద్ జాఫర్, షంషుల్ హుదా, డాక్టర్ అష్రాఫ్ ఉన్నారు. ఈ సిద్ధాంతాలను బాగా వంటపట్టించుకున్న ప్రముఖ కవులు సర్దార్ అలీ జాఫరి, సజ్జాద్ జహిర్, ఖ్వాజి నజ్రుల్ ఇస్లాం, మౌలానా హసరత్ మోహాని, హైదరాబాదుకు చెందిన మఖ్దూం మొహిద్దీన్, లాంటి వారెందరో కష్టనష్టాలను భరిస్తూ ప్రజలను ఆ దిశగా నడిపారు. ఈ సందర్భంగా అమీర్ హైదర్ ఖాన్, ముజఫర్ అహమ్మద్, షౌకత్ ఉస్మాని లాంటి నాయకుల మీద చరిత్ర ప్రసిద్ధి చెందిన పెషావర్, మీరట్ కుట్రకేసులను బ్రిటీష్ ప్రభుత్వం బనాయించి సంవత్సరాల తరబడి ఆ నేతలను జైళ్ళల్లో కుక్కింది.


షౌకత్ ఉస్మానీ

ఈ నేతలంతా ఒకవైపున జాతీయ కాంగ్రెస్‌లో సభ్యులుగా కొనసాగుతూ, కార్మికుల సంక్షేమం కోసం జరుగుతున్న ఉద్యమాలలో కీలకపాత్ర వహించారు. ఆ కృషిలో ముజఫర్ అహమ్మద్, షౌకత్ ఉస్మాని లాంటివారు జైలుశిక్షలకు కూడా గురయ్యారు. బ్రిటీష్ ప్రభుత్వం ఈ నాయకులో పలువురి మీద అనేక కుట్ర కేసులను నమోదుచేసి జైలు పాల్జేసింది. కమ్యూనిజం వైపు మొగ్గుచూపిన విప్లవ భావాలుగల వీరంతా కలసి భారత కమ్యూనిస్టు పార్టీని భారతదేశం అవతలి భూభాగంలో ప్రారంభించిన తొలి కమ్యూనిస్టులయ్యారు.


ముజఫర్ అహమ్మద్

ఈ చారిత్రాత్మక నిర్మాణంలో అబ్దుల్ రబ్ పేష్వారి, ముహమ్మద్ అక్బర్ ఖాన్, మియా అఖ్తర్‌షా, అజీజ్ అహమ్మద్, అబ్దుర్ రషీద్, అబ్దుల్ రెహమాన్, అబ్దుల్ వాహెద్, అబ్దుల్ కరీం, అబ్దుల్ ఖాశిం, అబ్దుల్ ఖాదిర్, అబ్దుల్ ఖాదర్ ఖాన్, అబ్దుల్ బారి, అబ్దుల్ మజీద్, అబ్దుల్ మాలిక్, అబ్దుల్ హమీద్, అబ్దుల్లా మొహమ్మద్, అబ్దుల్లా అన్సారి, అబ్దుల్లా ఖాన్, ప్రొఫెసర్ మహమ్మద్ హది, ప్రొఫెసర్ అహమ్మద్ హది, అబ్దుల్ జబ్బార్ ఖాద్రి, అబ్దుల్ సత్తార్ ఖాద్రి, షౌకత్ ఉస్మాని, జఫర్ ఇమామ్, ఫైజుల్లా మొహమ్మద్ తదితరులు ఉన్నారు. కార్మిక కర్షకుల నేతలుగానే కాకుండా ఆయా వర్గాల సంక్షేమాన్ని సౌభాగ్యాన్ని కోరే వ్యక్తులుగా కూడా అనేకమంది కళాకారులు, కవులు, రచయితలు ఆనాడు ముందుకొచ్చారు. వీరిలో ముజఫర్ అహమ్మద్, ఖాజీ నజ్రుల్ ఇస్లాం, సజ్జాద్ జహీర్, సర్దార్ అలి జాఫ్రీ, కె.ఎ. అబ్బాస్ మన రాష్ట్రా నికి చెందిన మఖ్దూం మొహిద్దీన్ లాంటి ప్రముఖులు ఉన్నారు.


హాజరా ఆపా


మఖ్దూం మొహిద్దీన్

స్వాతంత్ర్య సాధనకు జాతీయ కాంగ్రెస్ ప్రధాన ఆయుధమైంది. కమ్యూనిస్టు, సోషలిస్టు, విప్లవ భావాలు గల వారంతా జాతీయ కాంగ్రెస్‌లో అంతర్భాగమయ్యారు. గాంధీజీ తన వినూత్న ఉద్యమాల ద్వారా అశేష ప్రజానీకాన్ని కదిలించగలిగారు. కదిలించి ఉద్యమ దిశగా నడిపించగల నాయకులయ్యారు.

## అహింసా మార్గాన రెడ్‌షర్ట్స్ ఆత్మార్పణలు

1930లో శాసనోల్లంఘనకు గాంధీజీ పిలుపు ఇవ్వగానే ఖిలాఫత్ ఉద్యమం నాటి ఉత్సాహాన్ని ప్రదర్శిస్తూ ముస్లింలు శాసనోల్లంఘనలో పాల్గొన్నారు. ఈ ఉద్యమం పట్ల జమైతుల్ ఉలేమా, అరహార్ పార్టీ, జాతీయ ముస్లిం కాన్ఫెరెన్స్, ఖుదా-యే-ఖిద్మత్‌గార్ లాంటి సంస్థలు ఎంతో ఆసక్తి చూపాయి.

ఈ సందర్భంగా **సరిహద్దు గాంధీ**గా విఖ్యాతులైన పఠాన్ నాయకులు ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ తన సోదరునితో కలసి **ఖుదా-యే-ఖిద్మత్‌గార్** అహింసా యోధుల దళాన్ని ( రెడ్ షర్ట్స్) నిర్మించారు. ఈ దళ సభ్యులు బ్రిటీష్ పోలీసుల తీవ్ర నిర్బంధాల మధ్య ఎంతో ప్రశాంత చిత్తంతో అహింసామార్గం వీడక ప్రాణాలర్పించటానికి సిద్ధపడ్డారు.

ప్రపంచ ప్రఖ్యాతి చెందిన ఈ అహింసోద్యమంలో భాగంగా 1930 మే మాసంలో ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ స్వంత గ్రామంలో బ్రిటీష్ పోలీసుల పైశాచిక **కాల్పులకు వందలాది రెడ్ షర్ట్స్ దళ సభ్యులు బలైపోయారు. ఆనాటి సంఘటనలను**



బాద్షాఖాన్ స్వయంగా వివరించారు. ఆ కథనం చదువుతుంటే గుండె చెరువైపోతుంది.


మహాత్మాగాంధీతో సరిహద్దు గాంధీ

ఆ తరువాత కూడా లాహోర్‌లోని కిస్సాఖాని బజారులో నిరాయుధులైన రెడ్ షర్ట్స్ మీద బ్రిటీషు పోలీసులు కిరాతకంగా జరిపిన కాల్పులు వందలాది ప్రజలను బలి తీసుకున్నాయి. ఈ కాల్పులు మూలంగా, ప్రభుత్వం పోలీసులు, సైనికుల దాష్టికాల వలన యోధులు నేలకు వొరుగు తున్నా, ఏ మాత్రం భయపడని ఖుదా-యే-ఖిద్మత్‌గార్ వీరులు బ్రిటీషు బలగాల తుపాకులకు ఎదురు నిలిచారు. ప్రాణాలు కొల్పోయారు. ఏ మేరకు ప్రాణ నష్టం జరిగినా, బ్రిటీష్ పోలీసుల కిరాతకం ఎంతగా సాగినా, అహింసా మార్గాన్ని మాత్రం వీడలేదు. ఆ కారణంగా ప్రపంచ అహింసోద్యమ చరిత్రలో **ఖుదా-యే-ఖిద్మత్‌గార్ యోధుల** చరిత్ర ప్రత్యేక అధ్యాయమయ్యింది.

ఈ శాసనోల్లంఘన ఉద్యమంలో మౌలానా అల్తాఫ్ హుస్సేన్, అబ్దుల్ హయాత్, తయ్యుబ్ అలీ, గయాజుద్దీన్ పఠాన్, జలాలుద్దీన్ హాష్మి, ప్రొఫెసర్ హుమాయూన్ కబీర్, అబూహసన్ సర్కార్, రియాజుల్ కరీం, ఫక్రుద్దీన్ అలీ అహమ్మద్ తదితరులు పాల్గొన్నారు. ఈ నేతలంతా సుదీర్ఘ జైలు శిక్షలనుభవించారు.

1936లో లక్నోలో జరిగిన కాంగ్రెస్ సమావేశం తరువాత సామ్యవాద భావాలుగల నాయకులైన రఫీక్ జకారియా, కల్నల్ జైదీ, డాక్టర్ యూసుఫ్ మెహర్ అలీ, హుస్సేన్ జహీర్, కె.ఎ. అబ్బాస్, రఫీ అహమ్మద్‌లు జాతీయ కాంగ్రెస్‌లో చేరారు. మన రాష్ట్రం నుండి అబిద్ హుస్సేన్ సఫ్రాని, బద్రుల్ హసన్, సిరాజుల్ హసన్ తిర్మిజ్, బాకర్ అలీ మిర్జా, అహమ్మద్ అలీఖాన్ తదితరులు జాతీయ కాంగ్రెస్ సభ్యులయ్యారు.

ఈలోగా 1939 ద్వితీయ ప్రపంచ సంగ్రామం ప్రారంభమైంది. ఈ యుద్ధాన్ని పురస్కరించుకుని కాంగ్రెస్ మంత్రులంతా రాజీనామాలు చేశారు. ఖిలాఫత్ ఉద్యమంలో ఎంతో గర్వంగా పాల్గొన్న ముస్లింల విశ్వాసాలకు బలమైన గాయం అయ్యేలా టర్కీ అధినేత ముస్తఫా కమాల్ పాషా ఖిలాఫత్‌ను శాశ్వతంగా రద్దుచేసి తన రాజ్యాన్ని లౌకిక రాజ్యంగా ప్రకటించాడు.

# జిన్నా పునఃప్రవేశం - మారిన సమీకరణాలు

ముహమ్మదాలి జిన్నా 1924-1929 ప్రాంతంలో 14 సూత్రాల పథకం తయారు చేశారు. భవిష్యత్తు రాజ్యాంగ నిర్మాణంలో ఈ సూత్రాలను పరిగణనలోకి తీసుకోవాలన్నది జిన్నా ఉద్దేశ్యం. ఈ పథకం పూర్తి స్థాయి చర్చకు నోచుకునే లోపుగా లీగ్ అధ్యక్ష స్థానాన్ని వదలి ఆయన లండన్ వెళ్ళిపోయారు. 1930లో లండన్ వెళ్ళిపోయిన మహ్మద్ అలీ జిన్నా 1934లో ఇండియాకు తిరిగి వచ్చారు. ఆయన పునః ప్రవేశంతో జాతీయోద్యమంలో నూతన సమీకరణాలకు స్థానం కలిగింది. రాజకీయాలలో పలు సామాజిక వర్గాల మధ్య దూరం ఏర్పడింది. ఈ దూరం ముహమ్మదాలీ జిన్నా పునఃప్రవేశంతో మరికాస్త ఎక్కువైంది. ఆయన తిరిగి ఇండియా రాగానే ముస్లింలీగ్ అధికార పగ్గాలను చేబట్టారు. బలపడుతున్న జాతీయ కాంగ్రెస్‌ను బలహీనం చేసి లక్ష్యదిశగా సాగుతున్న స్వతంత్ర్య పోరాటాన్ని నిర్వీర్యం చేసేందుకు జిన్నాను బ్రిటీష్ ప్రభుత్వం పావులాగా వినియోగించదలచింది.



ఆ సమయంలో ద్వితీయ రౌండ్ టేబుల్ సమావేశానికి గాంధిజీ డాక్టర్ అన్సారిని తీసుకెళ్ళక పోవటంతో జిన్నాకు మంచి ఆయుధం లభించింది. భారతదేశంలోని ముస్లింలకు ప్రాతినిధ్యం వహించే ఏకైక సంస్థగా ముస్లింలీగ్‌ను తీర్చిదిద్ది, జవజీవాలు అందిచేందుకు ఆయన నడుం కట్టారు. ఒకప్పుడు జాతీయవాదిగా వ్యవహరించిన జిన్నా ఆలోచనలు ఆ తరువాత మారిపోయాయి.

1935 తరువాత జరిగిన ఎన్నికలలో బీహార్, బోంబాయి రాష్ట్రాలకు సంబంధించి పండిట్ జవహర్ లాల్ నెహ్రూ లాంటి కాంగ్రెస్ నాయకులు తీసుకున్న పలు అహేతుక నిర్ణయాలు ముస్లిం లీగ్ మరింత బలపడటానికి దోహదపడ్డాయి. ఈ విషయాన్ని మౌలానా అబుల్ కలాం ఆజాద్ తన ప్రఖ్యాత **ఇండియా విన్స్ ఫ్రీడం** గ్రంథంలో చాలా వివరంగా చర్చిస్తూ, ఉత్తర ప్రదేశ్ లో మంత్రివర్గం ఏర్పాటు విషయంలో జవహర్‌లాల్ తీసుకున్న నిర్ణయాన్ని స్పష్టంగా తప్పుపట్టారు.

( 'Jawaharlal's action gave the Muslim league in the UP, a new lease of Life. All Students of Indian politics know that it was **from** the UP

that the League was reorganized. Mr. Jinnah took full advantage of the situation and started an offensive, which ultimately led to Pakistan. - India Wins Freedom, Maulana Abul Kalam Azad, Orient Longman, Delhi, 1995, Page 171)

ఈ మేరకు క్రమంగా బలపడిన ముస్లిం లీగ్ 1940లో లాహోర్‌లో జరిగిన సమావేశంలో తొలిసారిగా ద్విజాతి సిద్ధాంతాన్ని రంగం మీదకు తెస్తూ, పాకిస్థాన్ ఏర్పాటును డిమాండ్ చేస్తూ తీర్మానించింది.

## 'లీగ్' విభజన రాజకీయాలకు వ్యతిరేకంగా పోరాటం

1935 నాటి భారత ప్రభుత్వ చట్టం ప్రకారంగా జరిగిన ఎన్నికలలో ముస్లింలీగ్‌ను మట్టికరిపిస్తూ, భారత జాతీయ కాంగ్రెస్ దేశవ్యాపితంగా ఘనవిజయం సాధించింది. వాయవ్య సరిహద్దు ప్రాంతాలలో కూడా **ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్, అల్లా బక్స్ సుంగ్రో**, అబ్దుల్ సమద్ ఖాన్, డాక్టర్ ఖాన్ సాబ్ లాంటి నేతల ప్రాబల్యం వలన జాతీయ కాంగ్రెస్ ఆధిపత్యాన్ని నిలబెట్టుకుంది.


డాక్టర్ ఖాన్ సాహెబ్

ఈ నేతలంతా లీగ్ మత రాజకీయాకు వ్యతిరేకంగా పోరాటం సాగించి, చివరి క్షణం వరకు ముస్లింలీగ్‌కు ఎదురు నిలిచి, ద్విజాతి సిద్ధాంతాన్ని, దేశ విభజన ఆలోచనలను తీవ్రంగా వ్యతిరేకించారు. ఆ కారణంగా అల్లా బక్స్ సుంగ్రో లాంటి లౌకిక ప్రజాస్వామ్య వాదులు స్వాతంత్ర్యానికి ముందు తరువాత కూడా మూడు దశాబ్దాలకు పైగా జైలు, ప్రవాస జీవితం గడపాల్సి వచ్చింది. 'బెలుచీ గాంధీ' గా పేర్గాంచిన **అబ్దుస్ సమద్ ఖాన్** అనేక సంవత్సరాలు కారాగారాన్ని అనుభవించారు. డాక్టర్ ఖాన్ సాబ్ అఖండ అధిపత్యంలో ఏర్పాటు చేసిన ప్రజా ప్రభుత్వాన్ని పలుసార్లు రద్దు చేయాల్సిన పరిస్థితులను ఎదుర్కోన్నారు.

## జిన్నా కంటే ముందే ద్విజాతి సిద్ధాంతం

ప్రముఖ ముస్లిం లీగ్ నాయకుడు మహమ్మద్ అలీ జిన్నా ఆలోచనల నుండి మాత్రమే ప్రప్రధమంగా ద్విజాతి సిద్ధాంత భావాలు ఉద్భవించ లేదు. ముస్లిం వ్యతిరేకత

నుండి ఈ భావం 1886 లో తొలిసారిగా పుట్టుకొచ్చింది. హిందూ మత ప్రముఖులు శ్రీ రాజ్‌నారాయణ బసు 1864లో **హిందూ మేళా** పేరుతో ఆ ప్రస్తావన తెచ్చారు. ఆ తరువాత 1923లో హిందూ మహా సభకు చెందిన భాయి ప్రేమానంద్ ఆ అభిప్రాయానికి మద్దతు పలికారు. హిందూ- ముస్లింల జనసముదాయాల ఆధిక్యతను బట్టి వేర్వేరు ప్రాంతాలుగా విభజించాలని ఆయన సూచించారు.

జాతీయ కాంగ్రెస్ ప్రముఖులు లాలా లజపతిరాయ్ **ట్రిబ్యూన్** అను ఆంగ్ల పత్రికలో వరుసగా (26th November నుండి 17th December 1924 వరకు) రాసిన 12 వ్యాసాలలో, హిందూ-ముస్లింలు వేర్వేరు జాతులని, ఈ రెండు జాతులు కలసిమెలసి జీవించటం సాధ్యం కాదని, అందువలన వేర్వేరుగా ఉండటం మేలన్న విధంగా అభిప్రాయాలు వ్యక్తం చేశారు.

1930లో ఖ్వాజా అబ్రహీం అను వ్యక్తి తొలిసారిగా **పాకిస్థాన్** అను మాటను ప్రస్తావించారు. ఈ నేపధ్యంలో 1940లో ముస్లిం లీగ్ ద్విజాతి సిద్ధాంతాన్ని రంగం మీదకు తీసుకొచ్చింది. ఒకప్పుడు కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయానికి చెందిన రహమత్ అలీ అను విద్యార్థి చేసిన **పాకిస్థాన్** ప్రతిపాదనను '..its a wild musing of an irresponsible student .'. అని స్వయంగా కొట్టిపారేసిన మహమ్మద్ అలీ జిన్నా లాహోర్ సమావేశంలో **పాకిస్థాన్ తీర్మానం** చేయించారు. అప్పటి నుండి పాకిస్థాన్ ఏర్పాటు ప్రతిపాదన ఊపందుకుని చివరకు విభజనకు కారణమైంది.

1940లో రాంఘర్‌లో మౌలానా అజాద్ అధ్యక్షతన జరిగిన జాతీయ కాంగ్రెస్ సమావేశంలో ద్విజాతి సిద్ధాంతాన్ని వ్యతిరేకించారు. మతానికి ద్వితీయ స్థానం కల్పిస్తూ ఆయన ప్రసంగించారు. ఈ మేరకు ఆయన తీర్మానాలు చేయించారు. ఈ తీర్మానాలు పట్ల ముస్లింలీగ్ తీవ్రంగా స్పందించింది. ఆ స్పందనే పాకిస్థాన్ ఏర్పాటు డిమాండ్‌గా బలపడింది. మౌలానా అబుల్ కలాం ఆజాద్ మాత్రం ఆ తీర్మానాన్ని అంతగా పట్టించుకొలేదు.

## 'క్విట్ ఇండియా' సృష్టికర్త యూసుఫ్ మెహర్ అలీ

క్రిప్స్ రాయబారం విఫలమైన తరువాత భారత దేశమంతటా ఒకే నినాదం మారుమ్రోగింది. అదే 'క్విట్ ఇండియా' నినాదం. ఈ నినాదం ఉద్యమంగా మారి ఉధృతరూపం ధరించింది. ఈ ఉద్యమంలో నేతలు, కార్యకర్తలు అసంఖ్యాకంగా జైళ్ళపాలయ్యారు. జైళ్ళు నిండిపోతున్నా తరలి వస్తున్న ప్రజానీకాన్ని నిలువరించేందుకు

సాగిన కాల్పులలో అనేకమంది అమరులయ్యారు. అంతటి ప్రభావాన్ని కలుగజేసిన నినాదాన్ని సృష్టించింది యూసుఫ్ మెహర్ అలీ.

1942 ఆగస్టు 9వ తేదీ నాటి సమావేశంలో యూసుఫ్ మెహర్ అలీ తాను ఓ చిన్న కాగితం మీద **క్విట్ ఇండియా** అను నినాదం రాసి ఆ కాగితాన్ని గాంధీజీకి అందించారు. గాంధీజీ 1940లో ఆగష్టులో క్విట్ ఇండియా **ఉద్యమాన్ని ప్రకటించారు.** చారిత్రక ప్రాధాన్యత గల ఈ క్విట్ ఇండియా నినాదాన్ని బోంబాయికి చెందిన ఉద్యమకారుడు యూసుఫ్ మోహరాలి సృష్టించిందని బహు గ్రంథ రచయిత Dr. AU Sahik IPS కథనం. ఈ మేరకు **క్విట్ ఇండియా** శీర్షికతో యూసుఫ్ మెహర్ అలీ ఓ గ్రంథాన్ని కూడా ప్రచురించారు. ఆ పుస్తకం పలు పునర్ముద్రణలకు నోచుకుంది.


డాక్టర్ సయ్యద్ మహమ్మద్

ఈ ఉద్యమంలో ఆంధ్రప్రదేశ్‌కు చెందిన ఫతే ఉల్లాఖాన్, ముహమ్మద్ హనీఫ్, ముహమ్మద్ హుస్సేన్‌లు ప్రముఖపాత్ర వహించారు. క్విట్ ఇండియా ఉద్యమం ఉవ్వెత్తున ఎగసిపడేసరికి పోలీసులు విచక్షణారహితంగా విరుచుకపడ్డారు. బ్రిటీషు పోలీసుల ఆకృత్యాలకు అంతులేకుండా పోయింది. అయినప్పటికి ప్రజలు పోరుబాట వీడలేదు. జాతీయ కాంగ్రెస్ నాయకులు మౌలానా ఆజాద్, డాక్టర్ సయ్యద్ మహమ్మద్, డా॥ అసఫ్ అలీ, తదితర ప్రముఖులను అరెస్టు చేసి అహమ్మద్ నగర్ కోటలో బంధించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొనవద్దని ముస్లిం లీగ్ నేతలు కోరినా, ఆ అభ్యర్థనలను ఖాతరు చేయకుండా ముస్లింలు పెద్ద సంఖ్యలో ఉద్యమించారు.

మౌలానా అజాద్ నిర్బంధం నుండి విడుదలయ్యాక, 1945లో జరిగిన సిమ్లా సమావేశానికి జాతీయ కాంగ్రెస్ ప్రతినిధిగా హజరయ్యారు. ఈ సందర్భంగా దేశంలోని ముస్లింలకు ముస్లిం లీగ్ మాత్రమే ప్రతినిధిగా పేర్కొంటూ ముస్లిం లీగ్ నాయకులు ముందుకు రావటంలో చర్చలు సఫలం కాలేదు. మౌలానా ఆజాద్ అధ్యక్షునిగా పని చేసిన కాలంలో ఆయన వ్యక్తిగత సత్యగ్రహ ఉద్యమం, క్రిప్సుతో చర్చలు, క్విట్ ఇండియా ఉద్యమాలకు సమర్థవంతమైన నాయకత్వం అందించారు.

# నేతాజీకి నమ్మకమైన సహచరులు

ఈ విధంగా ఎప్పటికప్పుడు జాతీయోద్యమంలోని అన్ని ప్రధాన ఘట్టాలలో **ముస్లిమేతర జనసముదాయాలతో** పాటుగా తమదైన భాగస్వామ్యాన్ని నిర్వర్తించిన ముస్లిం సమాజం, నేతాజీ సుభాష్ చంద్రబోస్ వెంట కూడా అదే స్థాయిలో తన పాత్రను నిర్వహించింది. నేతాజీ నాయకత్వంలోని ఆజాద్ హింద్ ఫౌజ్‌లో అనేకమంది ముస్లింలు ప్రధాన బాధ్యతలను నిర్వర్తించారు. మాతృభూమి సేవలో కర్తవ్యనిర్వహణ కొనసాగిస్తూ అమరులయ్యారు.


జనరల్ షానవాజ్ ఖాన్

ఆజాద్ హింద్ ఫౌజ్‌లో జనరల్‌గా షానవాజ్ ఖాన్, కల్నల్‌గా అజీజ్ అహమ్మద్, యం.కె. ఖైనీలు ప్రధాన బాధ్యతలు నిర్వహించారు. హైదరాబాద్ వాసులైన ముహమ్మద్ ఆయూబ్, ఖమరుల్ ఇస్లాం, **తాజుద్దీన్ గౌస్ వంటి యువకిశోరాలు** నేతాజీ వెంట నడిచారు. ఈ పోరాటం విఫలం తరువాత బ్రిటీష్ ప్రభుత్వం ఆజాద్ హింద్ ఫౌజ్ ప్రముఖులైన జనరల్ షానవాజ్‌ఖాన్, కెప్టెన్ వి.కె. సెహగల్, లెఫ్టినంట్ జి.యస్. థిల్లాన్‌ల మీద రాజద్రోహం నేరం మోపి విచారణకు ఆదేశించింది.

ఈ యోధుల పక్షాన వాదించేందుకుగాను **అబుల్ కలాం ఆజాద్** తగిన ఏర్పాట్లు చేయించారు. ఆ సందర్భంగా ముహమ్మద్ అలీ జిన్నా జనరల్ షానవాజ్ ఖాన్‌కు ఒక సందేశం పంపారు. రాజద్రోహం నేరం క్రింద విచారణకు గురైన మిగిలిన సహచరుల నుండి వేరుపడితే జనరల్ పక్షాన తాను కేసు వాదించటానికి సిద్ధమని జిన్నా తెలిపారు. అందుకు జనరల్ షానవాజ్ అంగీకరించలేదు.


అబిద్ హుస్సేన్ సఫ్రాని

జిన్నాకు సమాధానంగా **'స్వాతంత్ర్య సమరంలో మేం భుజం భుజం కలిపి పోరాడాం.** మా నాయకత్వం స్ఫూర్తితో మా కామ్రేడ్స్

యుద్ధభూమిలో వీరోచితంగా పోరాడుతూ ప్రాణాలు వదిలారు. నిలబడినా, నేలకూలినా కలిసే ఉంటాం, అని జనరల్ షా నవాజ్ స్పష్టం చేశారు.


సతీ అహ్మద్ చౌదరి

(' ..We have stood shoulder to shoulder in the struggle for freedom. My comrades have died on the field of battle inspired by our leadership we stood or fall together..')

ఈ విచారణ సందర్భంగా ఆజాద్ హింద్ ఫౌజ్ యోధులకు శిక్షలు పడితే సహించేదిలేదని ప్రజలు ప్రకటించారు. అప్పటికి రషీద్ అలీ అను వీరజవానుకు ఏడు ఏండ్ల జైలుశిక్ష విధించగా ప్రజలు ఆగ్రహావేశాలు వ్యక్తం చేశారు.

నేతాజీ సన్నిహిత సహచరులైన అక్బర్‌షా, 1941లో బ్రిటీష్ ప్రభుత్వం కళ్ళుగప్పి నేతాజీ ఇండియా నుండి తప్పించుకొని వెడుతున్నప్పుడు ఆయన వెంట ఉన్నారు. నేతాజీ బెర్లిన్ నుండి చాకచక్యంగా తప్పించుకున్న సాహసఘట్టంలో ఆయనతోపాటు 90 రోజులపాటు సబ్‌మెరైన్‌లో గడిపిన వ్యక్తిగా ఆయన కార్యదర్శి అబిద్ హుస్సేన్ సఫ్రాని అపూర్వ గౌరవాన్ని పొందారు. నేతాజీ టోక్యో నుండి ప్రయాణమైన విమానంలో ఆయన వెంట ఉండి వీరమరణం పొందిన వ్యక్తులలో కల్నల్ హబీబుర్ రహమన్ ఒకరు.

ఆ నాడు '..మీ రక్తం నాకివ్వండి.. మీకు నేను స్వాతంత్ర్యాన్నిస్తాను..' అంటూ, నేతాజీ సుభాష్ చంద్రబోస్ ఇచ్చిన నినాదాన్ని గౌరవిస్తు మాతృదేశ విముక్తి కోసం సాగిన సాయుధ పోరాటంలో నేలకొరిగిన యోధులలో కొందరి గురించి FREEDOM MOVEMENT AND INDIAN MUSLIMS లో గ్రంథ రచయిత .SANTIMOY RAY క్లుప్తంగా పేర్కొన్నారు.


ఖమురుల్ ఇస్లాం

ఆ నమోదు ప్రకారం పోరాటంలో అమరులైన వారిలో ప్రస్తుత పాకిస్థాన్ లోని పంజాబ్‌కు చెందిన అబ్దుల్ అజీజ్ అబ్దుల్ రహమాన్ ఖాన్, అహ్మద్ ఖాన్, అఖ్తర్ ఆలీ, అల్లావుద్దీన్ (హర్యానా -

కపుర్తలా), అల్తాఫ్ హుస్సేన్ (అమృతసర్), బషీర్ అహమ్మద్ (హర్యానా-రోధక్), చిరాగుద్దీన్ (పంజాబ్- లూధియానా), బషీర్ అహమ్మద్ (పంజాబ్- సియాల్‌కోట్), ప్రస్తుత పాకిస్థాన్ లోని జెహాలమ్‌కు చెందిన దిలావర్ ఖాన్, ఫతేఖాన్, ఫతే మహమ్మద్ (హర్యానా-రోధక్), పతే మముహమ్మద్ (పంజాబ్-హొషియాపూర్), ఫజల్‌ఖాన్ (పాకిస్థాన్-జెహలం), గులాం నబి (పంజాబ్-గురుదాస్ పూర్), ఇనాయతుల్లా (వాయవ్య సరిహద్దు రాష్ట్రం-పెషావర్), ఇర్షాద్ అలీ (హర్యానా-రోధక్), జమాలుద్దీన్ (పంజాబ్-కపుర్తలా), ఖాశిం అలీ (హర్యానా-హిస్సార్), మహమ్మద్‌ఖాన్ (పాకిస్థాన్ - నూర్‌పూర్), ఖుదా బక్ష్ (పాకిస్థాన్ - కాంబెల్లాపూర్), ఖాశిం అలీ (హర్యానా హిస్సార్), మహమ్మద్ ఖాన్ (పాకిస్థాన్ - నూర్‌పూర్), ఖుదా బక్ష్ (పాకిస్థాన్-కాంబెల్లాపూర్), ఖుషీ ముహమ్మద్ (పంజాబ్-లూధియానా), లాల్‌ఖాన్ (పంజాబ్-జెహలం), మహమ్మద్ అబ్బాస్ (రావల్పిండి) మహ్మద్ అఫజల్ (రావల్పిండి), మహమ్మద్ అన్వర్ (పాకిస్థాన్ - నూర్‌పూర్) మహమ్మద్ బనారస్ (రావల్పింది), బసమ్దద్ తీన్( పంజాబ్-సియాల్‌కోట), మహమ్మద్ అలీ (పాకిస్థాన్- లహోర్), మహమ్మద్ షఫీ(పంజాబ్ -జలంధర్), మహమ్మద్ ఉమర్ ఖాన్ (హర్యానా-రోధక్), మహమ్మద్ యాకూబ్ (వాయవ్యసరిహద్దు రాష్ట్రం-కోహట్) నబీ బక్ష్ (పంజాబ్ - కపుర్తలా) నూర్ హుస్సేన్ (పంజాబ్-కాని) తదితరులు ఉన్నారు.

ఆజాద్ హింద్ ఫౌజ్‌లో వివిధ పదవులు నిర్వహించి మాతృ భూమి విముక్తి పోరాటంలో పునీతులైన వందలాది వీరయోధులలో నక్కి అహ్మద్ చౌదరి, అష్రాఫ్ మండల్, అమీర్ హయత్, అబ్దుల్ రజాఖ్, అఖ్తర్ అలీ, మహమ్మద్ అలీషా, అటా మహమ్మద్, అహమ్మద్ ఖాన్, ఎ.కె. మీర్జా, అబూ ఖాన్, యస్. అఖ్తర్ అలీ, అహమ్మదుల్లా, అబ్దుర్ రహమాన్ ఖాన్ ఉన్నారు. మన హైదరాబాదుకు చెందిన అబిద్ హసన్ సఫ్రానితో పాటుగా ఖమ్రుల్ ఇస్లాం, తాజుద్దీన్ లాంటి యోధులు పలువురున్నారు.

## తుది తిరుగుబాటులోనూ త్యాగాలు

భారత స్వాతంత్ర్యోద్యమంలో చివరి ఘట్టంగా పేర్కొనదగినది రాయల్ ఇండియన్ నౌకాదళం తిరుగుబాటు. 1946 ఫిబ్రవరి మాసంలో జరిగిన ఈ తిరుగుబాటు, ఆనాటి బ్రిటీష్ పాలకుల తీవ్ర జాతి వివక్షతకు నిరసనగా మారింది. వివక్షకు వ్యతిరేకంగా విజ్ఞప్తులు, మహజర్లు సమర్పించినప్పటికి బ్రిటీష్ పాలకుల నుండి ఎటువంటి స్పందన లేకపోవటంతో విసుగు చెందిన రాయల్ ఇండియన్ నౌకాదళంలోని భారతీయ సిపాయిలు, అధికారులు ప్రత్యక్ష చర్యకు పూనుకున్నారు.

ఈ మేరకు విధులకు గైర్హాజరై సభలు, సమావేశాలు జరుపుతున్న సైనికులకు ప్రజానీకం మద్దతు లభించటంతో తిరుగుబాటు ఉధృతరూపం దాల్చింది. బొంబాయి, కరాచి, కలకత్తా, ఢిల్లీ, కొచ్చిన, జమానగర్, అండమాన్ తదితర ప్రాంతాలలో తిరుగుబాటు ప్రభావం చాలా తీవ్రంగా కన్పించింది. ఆయా ప్రాంతాలలో 78 నౌకలు, 20కు పైగా స్థావరాలు పూర్తిగా స్థంభించాయి. బ్రిటీష్ పాలకులపై 1857లో తొలిసారిగా సిపాయీల తిరుగుబాటు జరిగాక, తిరిగి 1946లో సిపాయిలు తిరుగుబాటు చేయటంతో ఖంగుతిన్న బ్రిటీష్ ప్రభుత్వం కర్కశంగా వ్యవహరించి కాల్పులు జరిపింది. ఈ కాల్పులలో వందలాది ప్రజలు, ఉద్యమకారులు బలయ్యారు. వీరిలో అత్యధికులు ముస్లింలు కావటం విశేషం.

ఈ సంఘటనకు ముందుగా **ఆజాద్ హింద్ ఫౌజ్** లో చేరిన భారతీయ సైనికుల మీద బ్రిటీష్ పాలకులు జరిపిన విచారణ, విధించిన శిక్షలు కూడా రాయల్ ఇండియన్ నౌకాదళం తిరుగుబాటుకు దోహదమయ్యాయి. ఈ విచారణ సందర్భంగా జనాబ్ రషీద్ అలీకి విధించిన 7 సంవత్సరాల కారాగారవాసం, తీవ్ర విమర్శకు గురైంది. ప్రజలు తీవ్ర నిరసనను వ్యక్తం చేస్తూ కలకత్తా పట్టణంలో ఊరేగింపులు జరిపారు.

ఈ విధంగా రాయల్ ఇండియన్ నౌకాదళం అధికారుల, సైనికుల తిరుగుబాటు అగ్నికి ఆజ్యం తోడైనట్లయ్యింది. బ్రిటీష్ పాలకుల పునాదులు పూర్తిగా కదలి పోయాయన టానికి ప్రబల నిదర్శనంగా నిలిచిందీ తిరుగుబాటు. ఈ తిరుగుబాటును జాతీయ కాంగ్రెస్, ముస్లింలీగ్‌లు వ్యతిరేకించాయి. తిరుగుబాటు సైనికులు మాత్రం కలసినట్టుగా కాంగ్రెస్ లీగ్‌ల పతాకాలను నౌకల మీద కలసి ఎగుర వేశారు. తిరుగుబాటుదారులందర్నీ విధులకు హాజరు కావాల్సిందిగా జాతీయ కాంగ్రెస్ అధ్యక్షులు మౌలానా అబుల్ కలాం ఆజాద్ కోరారు. బ్రిటీష్ ప్రభుత్వం తిరుగుబాటు సైనికుల మీద ఎటువంటి కక్ష సాధింపు చర్యలకు పాల్పడకుండా ఆయన చూశారు.

1857 నాటి తిరుగుబాటు తీరులో ఈ తిరుగుబాటుకు ప్రజల మద్దతు లభించటంతో అగ్నికి వాయువు తోడైనట్టయ్యింది. కాంగ్రెస్, ముస్లింలీగ్‌లు కూడా మద్దతు పలకటంతో 1857 నాటి ఐకమత్యం పదర్శితమైంది. 1857లో తిరుగుబాటు తరువాత, ఆంగ్లేయులు మూటముల్లె సర్దుకుంటున్నప్పుడు మళ్ళీ సైనికులు తిరగబడటంతో అధికారులు ఖంగుతిన్నారు. ప్రధాన నౌకా కేంద్రాలన్నిటిలో తిరుగుబాటు ప్రభావం కన్పించింది. ఈ చర్యతో మండిపడిన అధికారులు తిరుగబడిన జవానులు, ప్రజల మీద విచక్షణా రహితంగా కాల్పులు జరుపగా, ఆ కాల్పులలో అమరులైన వారిలో అత్యధికులు ముస్లింలు కావటం విశేషం.

## గాంధీ-ఆజాద్‌ల నాయకత్వం

భారత జాతీయోద్యమ చరిత్రలో 1940 నుండి స్వరాజ్యం సిద్ధించేంత వరకు జరిగిన పోరాటాలకు మహాత్మాగాంధీ, మౌలానా ఆజాద్‌ల నాయకత్వం మార్గదర్శకత్వం వహించిందనవచ్చు. ప్రారంభం నుండి జాతీయ రాజకీయాలలో కీలకపాత్ర వహించిన మౌలానా 1923లో ఢిల్లీ కాంగ్రెస్ సమావేశానికి అధ్యక్షత వహించారు. 1940లో రాంఘర్ కాంగ్రెస్ సమావేశంలో ఆయన జాతీయ కాంగ్రెస్ అధ్యక్షులుగా నియుక్తులై సుదీర్ఘకాలం కీలకపాత్ర నిర్వహించారు. ముస్లింలీగ్ రాజకీయాల వలన ఎదురయ్యే ప్రమాదాలను ఆది నుండే గ్రహించిన మౌలానా ముస్లింలను హెచ్చరిస్తూ వచ్చారు. స్వరాజ్యం కంటే హిందూ-ముస్లింల ఐక్యతకు ప్రథమ స్థానం కల్పించిన ఆజాద్ ద్విజాతి సిద్ధాంతాన్ని వ్యతిరేకించారు. ముస్లింలీగ్, హిందూ మహాసభ, బ్రిటీష్ ప్రభుత్వం నుండి ఎదురవుతున్న **విభజన** ప్రమాదంతోపాటుగా కాంగ్రెస్ నేతల మధ్యగల అంతర్గత విభేదాలను ఆయన ఎదుర్కోవాల్సి వచ్చింది. అన్ని అరిష్టాలను సమర్థవంతంగా ఎదుర్కొన్న మౌలానా, విభజన విషయంలో మాత్రం నిస్సహాయులయ్యారు. ఈ విషయంలో గాంధీజీని ఆశ్రయించినా ఫలితం లేకుండాపోయింది. చిట్టచివరకు 1947లో జవహర్ లాల్ నెహ్రూ అధ్యక్షతన ఏర్పాటైన జాతీయ కాంగ్రెస్ సమావేశం విభజనను అంగీకరించటంతో విభజనను నివారించటానికి మౌలానా చేసిన ప్రయత్నాలన్నీ వృధా అయ్యాయి. జాతీయవాద ముస్లింలంతా ఈ పరిణామానికి హతాశులయ్యారు.

## విభజన మూల్యం ద్వారా లభించిన స్వరాజ్యం

1947 ఫిబ్రవరి 20వ తేదిన బ్రిటీష ప్రధాన మంత్రి అట్లీ మాట్లాడుతూ 1948 జూన్‌లోగా భారతదేశం నుండి తాము వైదొలగుతున్నట్టు ప్రకటించారు. ఈ కార్యక్రమాన్ని నిర్వహించేందుకు మౌంటు బాటన్‌ను ఇండియాకు పంపారు. ఆయన 1947 జూన్ 3వ తేదిన ఓ పథకాన్ని ప్రకటించాడు. మౌంటు బాటన్ ఇండియాను చీల్చేందుకు తొందరపడటాన్ని గ్రహించిన మౌలానా వ్యాకులత చెందారు. ఇండియా విభజన ప్రతిపాదనకు క్యాబినెట్ మిషన్ పథకం సరైన పరిష్కారామని ఆయన భావించారు. ఇండియాలో మత సమస్య ప్రధానం కాదని, ప్రజల అభ్యున్నతి కోసం సాగాల్సిన ప్రయత్నాలు, పథకాలకు ప్రాధాన్యత నివ్వాలని ఆయన అభిప్రాయపడ్డారు.

మౌలానా ద్విజాతి సిద్ధాంతాన్ని వ్యతిరేకించారు. ఇండియా సంస్కృతి

నాగరికతలు అవిభాజ్యమైనవి. అవి మతం పేరిట విభజనకు గురికావు అన్నాడు. అందుకు ఆయనోక ఉదాహరణ కూడా ఇచ్చారు. అ ఉదాహరణ ప్రకారంలో ఓ కర్ర ముక్కను నీళ్ళతో నిండిన బక్కెట్టులో వాలుగా ముంచితే ఆ కర్ర విరిగి రెండు భాగాలైనట్టుగా కన్పిస్తుంది. నిజానికి కర్ర మాత్రం యధాతథంగా ఉంటుందని ఆయన వివరించారు.

( ' If we put a stick in the water, it may appear that the water has been divided but water remains the same and the moment the stick is removed, even the appearance of division disappears ' - India Wins Freedom, Moulana Abul Kalam Azad,Orient Longman, Hyderabad,1995 Page.215)

## విభజనకు జాతీయవాద ముస్లింల వ్యతిరేకత

1940 నుండి 1947లో స్వాతంత్ర్యం సిద్ధించేంత వరకు జాతీయోద్యమానికి గాంధీ-మౌలానాల నాయకత్వం మార్గదర్శకత్వం వహించిందనవచ్చు. ఆ సమయంలో కాంగ్రెస్ అధ్యక్ష స్థానంలో ఉన్న ఆజాద్, ద్విజాతి సిద్ధాంతం, విభజన ప్రతిపాదనలు తెచ్చిపెట్టే ప్రమాదాన్ని గ్రహించారు. అందువలన ఆయన స్వరాజ్యం కంటే హిందూ-ముస్లింల ఐక్యతకు అత్యధిక ప్రాధాన్యతనిచ్చారు. స్వర్గం నుండి దేవదూతలు దిగి వచ్చి స్వరాజ్యమా? హిందూ-ముస్లింల మధ్యన ఐక్యతా? ముందు ఏది కావాలి అంటే నేను హిందూ మస్లిం మధ్యన ఐక్యతను కోరుకుంటాను. స్వరాజ్యం లభించటంలో ఆలస్యమైనా ఎటువంటి నష్టం లేదుకాని, భారత దేశంలోని ప్రధాన సాంఘిక జనసము దాయాలైన హిందూ-ముస్లింల ఐక్యతకు విఘాతం కలిగితే అది యావత్తు మానవజాతి మనుగడకు ప్రమాదమని అభిప్రాయపడుతూ మౌలానా హెచ్చరికలు చేశారు.

(' If an angel descends from heaven today and proclaims from the Qutub Minar that India can attain Swaraj within 24 hours provided I relinquish my demand for Hindu-Muslim Unity, I shall retort to it: ' No my friend, I shall give up Swaraj, but not Hindu-Muslim unity, for if Swaraj is delayed, it will be a loss for India, but if Hindu-Muslim unity is lost, it will be a loss for the whole of mankind. -Understanding Muslim Mind, Rajmohan Gandhi, Penguin Books, 1986, Page. 230)

మతం ప్రాతిపదికన విభజన కోరుకుంటున్న విభజనవాదులు, మతం మనుషులను ఏకం చేస్తుదంటూ చేస్తున్న వాదాన్ని మౌలానా తిప్పి కొడుతూ, భౌగోళికంగా, ఆర్థికంగా, భాషాపరంగా, సంస్కృతి పరంగా వేర్వేరుగా ఉన్న మనుషుల్ని మతం ఐక్యం

చేస్తుందన్న మాట గొప్ప మోసమన్నారు ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక, బాషాపరమైన అడ్డుగోడలు లేకుండా అందర్ని ఏకం చేయాలని ఇస్లాం ప్రయత్నించింది. కాని చరిత్ర మరోరకం వాస్తవాలను వెల్లడిస్తుంది. ప్రథమ శతాబ్దం దాటగానే ముస్లిం దేశాలను ఇస్లాం ఆధారంగా ఎందుకని ఏకం చేయలేకపోయిందని ప్రత్యర్థులను ప్రశ్నించారు.

(' It is one of the greatest frauds on the people to suggest that religious affinity can unite all area's, which are geographically, economically, linguistically and culturally different. It is true that Islam sought to establish a society, which transcends racial, linguistic, and economic and political frontiers. History however proved that after the few decades or at most after the first century Islam not able to unite all the Muslim countries on the basis of Islam alone..' -India Wins Freedom, Moulana Abul Kalam Azad, Orient Longman, Hyderabad,1995 Page. 248)

రెచ్చగొట్టబడిన ఉన్మాదం, అధికారం ద్వారా లభించే ప్రయోజ నాల ఆకర్షణల మీద బలంగా పనిచేయడం, విభజన వాదులకు రుచించలేదు. విభజన డిమాండ్ ఊపందుకుంది. ఈ వాతావరణానికి బ్రిటీష్ పాలకవర్గాల కుటిలత్వం తోడుకావటంతో ఎవరు ఎంతగా వారించినా ఫలితం లేకుండా పోయింది. ముస్లింలలో అత్యధికులు విభజనను వ్యతిరేకించారు. మౌలానా అజాద్ విభజన అలోచనను తీవ్రంగా ప్రతిఘటించారు. విభజన వలన రెండు దేశాలు ఏర్పడితే మత విద్వేషాలకు కారణం కాగలవని మౌలానా హెచ్చరించారు.

మనం త్వరపడి విభజనను అంగీకరిస్తే జిన్నా ద్విజాతి సిద్ధాంతాన్ని అంగీకరించినట్టు కాగలదని మౌలానా అన్నారు. (accept partition was to accept Jinnah's two-nation theory.) విభజనను అంగీకరిస్తే ఇండియాకు శాశ్విత గాయాన్ని చేసినవారం కాగలమని ఆయన అవేదన వ్యక్తం చేశారు. (if we acted in haste and accepted partition, we should be doing permanent injury to India)

## అత్యధికులు విభజనకు వ్యతిరేకం

ఈ సందర్భంగా విభజన మీద ప్రజాప్రతినిధుల అభిప్రాయాన్ని తెలుసుకునేందుకు బెంగాలులో ప్రయత్నం జరిగింది. ఆ ఎన్నికలో అత్యధిక హిందూ శాసన సభ్యులు గల ప్రాంతాల శాసనసభ్యులు విభజన డిమాండుకు మద్దతు పలుకగా, ముస్లిం శాసనసభ్యులు అత్యధికంగా గల ప్రాతంతాలలోని శాసనసభ్యులు విభజనను వ్యతిరేకించటం విశేషం. భారత విభజన మీద శాసన సభ్యుల అభిప్రాయాలను సేకరించేందుకు

1947 జూన్ 20వ తేదిన బెంగాలులో ఎన్నిక జరిగింది. ఆ ఎన్నికలకు గాను శాసన సభ్యులను రెండు విభాగాలుగా వర్గీకరించారు. సర్ ఉదయచంద్ మెహతాబ్ అధ్యక్షతన ముస్లిమేతర శాసనసభ్యులు అత్యధికంగా గల ప్రాంతంలోని శాసనసభ్యుల అభిప్రాయాన్ని తెలుసుకున్నారు. ఈ విభాగంలోని 11 జిల్లాలకు చెందిన మొత్తం 79 మంది శాసనసభ్యులు ఉన్నారు. ఈ సభ్యులలో 58 మంది విభజన కావాలని కోరగా 21 మంది వద్దన్నారు. ముస్లిం శాసన సభ్యులు అత్యధికంగా గల ప్రాంతాలలో మొత్తం **141** మంది శాసన సభ్యులు ఉన్నారు. ఈ శానస సభ్యులలో 35 మంది విభజనకు అంగీకరించగా, 106 మంది విభజన వ్యతిరేకించారు. భారత విభజనను మొత్తం మీద 162 మంది వ్యతిరేకించగా 114 మంది మద్దతు పలికారు. భారత విభజన గురించి ప్రజలలో స్థిరీకరించబడిన సాధారణ అభిప్రాయానికి భిన్నంగా, అనాడు ముస్లిం శాసన సభ్యులు అధికంగాగల ప్రాంతాలలోని అత్యధిక శాసన సభ్యులు విభజనను వ్యతిరేకించటం గమనార్హం.

(In Bengal Muslim legislators opposed partition while Hindu legislators demanded partition of India. As per Mr. A Leonard Gordon, out of total 79 legislators from Hindu majority area 21 voted against the partition, 58 demanded partition. Likewise out of 141 legislators of Muslim majority area 106 voted against partition and 35 supported the demand for partition. It reveals that majority number of Muslim legislators opposed the partition of India. This was supported by VP Menon, the personal secretary to the then Home Minister Sri Sardar Patel, in his book TRANSFER OF POWER. -Dalith-Muslim Unity Why? And how?, by Dr. Ram Nath, DSA, Bangalore, 1995 and RADIANCE Views Weekly, 31 Aug. - 6 September 2003, Special Issue ).

చివరకు 1947లో పండిట్ జవహర్‌లాల్ అధ్యక్షతన జరిగిన కాంగ్రెస్ సమావేశం విభజన ప్రతిపాదన చేయగా ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ తప్ప భారత విభజనకు అంతా అంగీకారం తెలిపారు. ఈ మేరకు భారత విభజనను వ్యతిరేకిస్తూ మౌలానా ఆజాద్, సరిహద్దు గాంధీ చేసిన పలు ప్రయత్నాలు బూడిదలో పోసిన పన్నీరయ్యాయి. ఆ సమయంలో బాధతో కృంగి పోతూ, **'మమ్మల్ని మీరు తోడేళ్ళ పాల్జేశారు'** అని మహాత్మా గాంధీతో మాట్లాడుతూ ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ వాపోయారు. (తోడేళ్ల పాలు చేశారు, పార్యేలాల్, అనువాదం ః జి. కృష్ణ, గాంధీ సాహిత్య ప్రచురణా లయం, హైదరాబాదు, 1969 పేజి. 148) ఈ పరిమాణాలకు జాతీయవాదులైన ముస్లింలంతా హతాశులయ్యారు.

## షోయాబుల్లా ఖాన్ బలిదానం

ఈ సందర్భంగా భారతదేశంలో హైదరాబాదు సంస్థానం విలీనాన్ని పురస్కరించుకొని నిజాం నియంతృత్వానికి వ్యతిరేకంగా రజాకార్ల రంగును బహిర్గతపర్చుతూ జనం కోసం పోరాడిన పాత్రికేయులు షోయాబుల్లా ఖాన్ గురించి ప్రస్తావించాలి. హైదరాబాద్ నడి బొడ్డున రజాకార్లు 1948లో ఆయనను కాల్చి వేసి, కసితీరక, జనం కోసం కలాన్ని ఆయుధంగా చేపట్టి, నియంతృత్వంపై అక్షరాగ్నులు కురిపించిన చేతిని దారుణంగా నరికి వేశారు. రజాకారుల దాడిలో దారుణంగా గాయపడిన షోయాబుల్లా ఖాన్ **'మరణం అనివార్యం. చావు నుండి ఎవ్వరూ తప్పించుకోలేరు. ఆ మరణం ఓ లక్ష్యం కోసం సంభవిస్తే గర్వించాలి. నేను దేశం కోసం మరణిస్తున్నందుకు మీరు సంతోషించాలి'** అంటూ 1948 ఆగస్టు 22వ తేదిన కన్నుమూశారు.


షోయాబుల్లా ఖాన్

ఈ విధంగా భారత స్వాతంత్ర్యోద్యమంలో తమ పరిధులు, పరిమితుల మేరకు భాగస్వామ్యం వహిస్తూ పీడిత జన పక్షపాతులుగా ప్రజలతో కలసి పనిచేసిన ప్రముఖులలో ముస్లిములు అనేకమంది ఉన్నారు.

## ముస్లింల ప్రస్తావన లేని చరిత్ర అసంపూర్ణం

భారత విభజన వలన పలు ప్రయోజనాలను ఆశించిన సంపన్న కులీన వర్గాలు, విద్యాధికులు, అధికారం రుచి మరిగిన రాజకీయ వేత్తలు ఈ గడ్డను వదిలి వెళ్ళిపోయారు. ఈ మట్టిని వదలి పెట్టలేని, కొంగ్రొత్త ఆకర్షణలకు ఏమాత్రం చలించని సామాన్య ముస్లిం జనసముదాయాలు తమ భాగస్వామ్యం ఏమాత్రం లేని విభజనకు దూరంగా, లౌకిక భారతం మీద పరిపూర్ణ విశ్వాసంతో, స్వంత గడ్డ మీదనే ఉండిపోయారు. మాతృభూమి అభివృద్ధి కోరుకుంటూ, పుట్టి పెరిగిన గడ్డ పేరు ప్రతిష్టలను యినుమడింపచేసే పలు జీవన రంగాలలో విశిష్ట భాగస్వామాన్ని అందిస్తూ భారతీయ సమాజంలో అవిభాజ్య భాగమైపోయారు.

ఈ విషయాన్ని మౌలానా ఆజాద్ మాటల్లో చెప్పాలంటే, నేను భారతీయుడ్ని కావటం నాకు గర్వకారణం. అవిచ్ఛిన్నమైన ఐక్యత అన్నట్టి జాతీయతలో నేనోక భాగాన్ని. అతి సుందరమైన ఈ భారత జాతీయత, నేను లేకపోతే అసంపూర్ణమైపోతుంది. భారత దేశం నిర్మాణంలో నేను కూడా ఒక ముఖ్యమైన ఉపకరణాన్ని ఈ హక్కును నేను కోల్పోదలచుకో లేదు. (అబుల్ కలాం అజాద్, ఆర్ష్ మల్సియాని, భారత ప్రభుత్వ ప్రచురణలు, 1983, పేజి.105)



## రచయిత ఇతర రచనలు

01. భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లిం మహిళలు
02. భారత స్వాతంత్ర్యోద్యమం : ఆంధ్రప్రదేశ్ ముస్లింలు
03. భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లిం ప్రజాపోరాటాలు
04. మైసూరు పులి : టిపూ సుల్తాన్
05. షహీద్ -యే- ఆజం అష్ఫాఖుల్లా ఖాన్
06. భారత స్వాతంత్ర్యసంగ్రామం : ముస్లిం యోధులు-1

# ఆధార గ్రంథాలు


1. Bharat Ke Swatantrata Sangram Mein Muslim Mahilaoun Ka Yogdan. - Dr. Abida Samiuddin, Institute of Objective Studies, New Delhi, 1997 (Hindi)
2. Muslims in India, Vols I&II, Jain Naresh Kumar, Manohar Publication, Delhi 1979.
3. Freedom Movement and Indian Muslims-Shantimoy Ray. People's Publishing House Pvt. Ltd., New Delhi. 1983.
4. History of Freedom Movement in India - Tarachand, Vols. I&II, Govt. Publications, New Delhi.
5. Collected Works of Mahathma Gandhi, Govt. Publications, Govt. of India, New Delhi.
6. Who is Who Indian Martyrs - Dr. P.N. Chopra, Govt. of India Publications.
7. Prominent Muslim women in India (Bibliographical Dictionary)- Al Kabir Al Kausar, Life and Light Publications, New Delhi, 1982.
8. Eminent Muslim Freedom Fighters, G. Allana, Low price Publications, Delhi, 1993.
9. India's Struggle for Independence 1857-1947, Bipan Chandra etc.- Penguin Books, 1997
10. Freedom Fighters Remember - Naveen Joshi, Govt. of India Publications.
11. India Wins Freedom - Maulana Abul Kalam Azad, Orient Longman 1995, Delhi.
12. Souvenir, Published by Institute of Objective Studies, New Delhi, 1995.
13. Understanding the Muslim Mind- Rajamohan Gandhi, Penguin Books, 1987.
14. History of India - E. Marsden, Mac Millan & Co. Ltd., London; 1944.
15. The Muslim Situation in India -Ed. Iqbal A. Ansari, Sterling Publishers Pvt. Ltd., 1990.
16. Wahabi And Farazi Rebels of Bengal - Narahari Kaviraj, People's Publishing House; 1982.
17. Muslims in India - S. Abul Hasan Ali Nadwi, Academy of Islamic Research and Publications, Lucknow, 1980.

18. Bharathada Swathanthry Sangramadalli Muslimara Paathra (Kannada), Khuddam Publications, Goodinabali, Karnataka - 1999.
19. Who's Who of Freedom Struggle in A.P. Vols. I, II, III - A.P. Govt. Publications, 1983.
20. 1857 the Great Rebellion, Ashok Mehatha
21. 20 Great Women of India, Ed. by AP Sarma, Prasant, New Delhi, 2003
22. A Concise History of The Indian People, H.G Rawlinson, OUP, 1950
23. The Indian Mutiny, G B Malleson, London, 1906.
24. A Survey of Indian History, K M Panikkar, Bombay, 1977
25. An Advanced History of India, RC Majumdar, Macmillan, Madras, 1996.
26. Aurangzeb And Tipu Sultan, Dr. BN Pande, IOS New Delhi, 1996
27. Eighteen Fifty-Seven, Surendra Nathsen, Govt. of India Publications, 1957
28. Highlights of the Freedom Movement in AP, Dr.Sarojini Regani, 1972
29. History of Bengal, Edited by Jadunath Sarkar.
30. History of British India, James Mill
31. History of Freedom Movement in India, RC Majumdar, Calcutta,1962
32. History of The Deccan, 2Vols. , GDE Gribble, New Delhi, 1990
33. How India wrought for Freedom, Annei Besant, 1915
34. How India Struggled for Freedom, Gopal Ram, Bombay, 1967
35. India's Struggle for Independence, Dr. Bibin Chandra, Penguin s Books, New Delhi, 1997
36. Indian Muslims : A Political Boigraphy, Gopal Ram, Bombay, 1959
37. Indian Muslims, M. Mujeeb, New Delhi, 1967
38. Indian Muslims., Ed. by Dr. Asghar Ali Engineer, Delhi, 1985
39. Kerala Muslims, Ed. Dr Asghar Ali Engineer, Ajantha Publications,1995 40. Mopilla Muslims of Kerala - Ronald E Miller, Orient Longman, Madras, 1976
40. Muslim India, Md. Nomani. Kitabistan, Allahabad, 1942
41. Muslim Politics in Sindh (1938-1947), Md. Qasim Soomro, Pakisthan, 989
42. Muslim Rule In India, V D Mahajan, 1970
43. Muslims and Freedom Movement In India, K. Chabuey, Allahabad, 1990
44. Muslims and India's Freedom Movement, Shan Muhammad, IOS, 2002

45. Muslims In India - S.Abul Hasan Ali Nadwi, Lucknow, 1980
46. Rise of Muslims in Indian Politics, Rafiq Zakaria, Bombay, 1986
47. Role of Indian Muslims in Struggle for Freedom, Ed. by PN Chopra, 1979
48. Role of Muslims in the National Movement, Mujafar Iman, Delhi, 1987 .
49. Saiyed Ahamed Shahid, Mohiuddin Ahmed, AIRP, Lucknow, 1980
50. Strom Over Srirangapatnam , P. Fernandaz
51. The Communal Triangle In India, Ashok Mehatha Ect., Allahabad, 1942
52. The Discovery Of India, Jawahar Lal Nehru, 1982
53. The Fakirs and Sannyasi Uprisings, Atis K. Dasgupta, New Delhi, 1992
54. The Great Mutiny India 1857, Christopher Hibbert, Penguin, 1980
55. The Indian Musalmans, W.W Hunter, Calcutta,
56. The Legend Makers- Some Eminent Muslim Women of India, Gouri Srivastava, CPC, New Delhi, 2003
57. The Muslims of British India, P Hardy, Cambridge, 1972
58. The Politics of a Popular Uprisings -Bundelkhand in 1857, Tapti Roy, OUP 1984
59. The Role of Minorities In Freedom Struggle - Ed. Dr. A. Ali Engineer, 2006
60. The Seopy Mutiny and the Revolt of 1857- R.C.Majumdar, Calcutta, 1957
61. The Sword of Tipu, Bhawan S. Gidwani, Allied Publishers Ltd., 1990
62. The Wahabi Movement in India, Qeyammudin Ahamed, Calcutta, 1966
63. Tipu Sultan, Prof. B.Shaik Ali, National Book Trust, India, 1995
64. Titu Mir, Mahaswetha Devi, Seagull Books, Calcutta, 2000
65. Wahabi and Farazi Rebels of Bengal, N. Kaviraj, PPH, New Delhi, 1982
66. Who is Who Indian Martyrs (3 Vols.) , Dr. PN Chopra, 1973
67. Who's Who Freedom Struggle in AP, (3 Vols.) Dr. Sarojini Regani, 1982
68. Mohammad Ali Jinnah, Matlubul Hasan Sauyid, Lahore, 1945.
69. The History of National Congress, B.Pattabhi Seetharamiah, Madras, 1935.

**Some other**

**TELUGU BOOKS, NEWS PAPERS, JOURNALS.**



# తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్ ప్రచురణలు

1. దివ్యఖుర్‌ఆన్
2. ఖుర్‌ఆన్ అవగాహనం (30వ భాగం)
3. దివ్యఖుర్‌ఆన్ (30వ భాగం)
4. హదీసు వెలుగు (స్టాకులో లేదు)
5. హదీసు వెలుగు (అరబీ మూలంతో)
6. ప్రవక్త ప్రవచనం (అరబీ మూలంతో)
7. ఇస్లామీయ జీవన సరళి
8. మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం)
9. ఇస్లాం అపార్థాల మబ్బుల్లో
10. ఇదియే ఇస్లాం
11. నేను ఆరాధించే ఇస్లాం
12. వెన్నెల తెరలు
13. సందేహాలు-సమాధానాలు
14. జుమా ప్రసంగాలు
15. సంకెళ్ళు
16. ప్రభువు పిలుస్తున్నాడు
17. ఆధునిక ఆర్థిక సిద్ధాంతాలు
18. ధర్మపథంలో జీవనరథం
19. ఇస్లాం శిక్షణ
20. ఆరాధనలు
21. నమాజ్ పుస్తకం
22. ఇస్లామ్ ప్రవక్త ముహమ్మద్
23. ఇస్లామ్ మరియు అజ్ఞానం
24. సాక్ష్యం మానవాళి సమక్షంలో
25. ఇస్లాం రాజకీయ సిద్ధాంతం
26. హేతువు కాంతిలో దైవప్రవక్త
27. ప్రవక్త సందేశం
28. ఖుర్‌ఆన్ అవగాహనకు మూలసూత్రాలు
29. భవబంధాలు మోక్షానికి ప్రతిబంధకాలా?
30. అంటరానితనం
31. ఆదర్శమూర్తి
32. శ్రేయస్కరమార్గం
33. మరణానంతర జీవితం
34. ధర్మ సంస్థాపనం
35. నమాజ్
36. ఇస్లాం పరిచయం
37. ముఖ్య హితవులు
38. కారుణ్య వ్యవస్థ
39. దివ్యఖుర్‌ఆన్ ముహమ్మద్ రచనకాదు
40. పరదా ప్రగతికి ప్రతిబంధకమా?
41. యదార్థమేది?
42. దైవ నియమావళి
43. లోకశాంతి
44. మతము - రాజకీయం
45. నిర్మాణం - విచ్ఛిన్నం
46. ముస్లిం పర్సనల్ లా
47. ఈమాన్ వాస్తవికత (ఖుత్బాత్ 1వభాగం)
48. ఇస్లాం వాస్తవికత (ఖుత్బాత్ 2వ భాగం)
49. ఆరాధనల వాస్తవికత (ఖుత్బాత్ 3వ భాగం)
50. జకాత్ వాస్తవికత (ఖుత్బాత్ 4వ భాగం)
51. హజ్ వాస్తవికత (ఖుత్బాత్ 5వ భాగం)
52. కలిమయే తయ్యిబా అర్థం
53. అల్ ఫాతిహా (తఫ్హీముల్ ఖుర్‌ఆన్)
54. ఇస్లామీ మతధర్మం
55. పెట్టుబడిదారీ-సామ్యవాదం-ఇస్లాం
56. ఇస్లాం దృష్టిలో మద్యనిషేధం
57. ధర్మపథం
58. సత్యధర్మం
59. ఖురానీ గాథలు
60. దైవప్రవక్తలు (1వ భాగం)
61. దైవప్రవక్తలు (2వ భాగం)
62. దైవప్రవక్తలు (3వ భాగం)
63. దైవప్రవక్తలు (4వ భాగం)
64. నీతి కథలు (1వ భాగం)
65. నీతి కథలు (2వ భాగం)
66. నీతి కథలు (3వ భాగం)
67. నీతి కథలు (4వ భాగం)
68. ఈ తల్లి ఒడిలో...

69. బుస్రా ఉత్తరాలు
70. ప్రియమైన అమ్మకు...
71. తీర్పులు
72. విరిసిన మొగ్గలు
73. మణిహారం (1వ భాగం)
74. మణిహారం (2వ భాగం)
75. మహనీయుల బాట (1వ భాగం)
76. మహనీయుల బాట (2వ భాగం)
77. నికాహ్ ప్రసంగం
78. జమాఅతె ఇస్లామీ హింద్ చరిత్ర (1వభాగం)
79. జమాఅతె ఇస్లామీ హింద్ చరిత్ర (2వ భాగం)
80. జమాఅతె ఇస్లామీ హింద్ చరిత్ర (3వ భాగం)
81. దివ్యగ్రంథంలో దైవప్రవక్త
82. దైవదాస్యమే మానవ ఔన్నత్యం
83. మానవ హక్కులు
84. జాతీయ సమైక్యత
85. ఇస్లాం ప్రబోధిని (మొదటి భాగం)
86. ఇస్లాం ప్రబోధిని (రెండవ భాగం)
87. ఇస్లాం ప్రబోధిని (మూడవ భాగం)
88. ఇస్లాం ప్రబోధిని 4వ భాగం
89. బైబిల్‌లో ముహమ్మద్
90. మానవులు - సమస్యలు
91. దైవ మార్గంలో సతత సమరం - జిహాద్
92. ప్రియ ప్రవక్త (సఅసం)
93. మానవసేవ
94. టెర్రరిజం-ఇస్లామీయ బోధనలు
95. మాటల ముత్యాలు
96. హజ్రత్ సాలమ్ (రజి)
97. సామాజిక న్యాయం ఇస్లాంలోనే సాధ్యం
98. ఇస్లామీయ పరిభాషలో జిహాద్
99. రండి! ఈ ప్రపంచాన్ని మారుద్దాం!
100. భారతీయ సమాజంలో పరమత సహనం
101. నవయుగం నవతరం
102. భారత దేశంలో ఇస్లామీ సందేశం
103. ఇస్లాం ఉగ్రవాదానికి వ్యతిరేకం
104. సత్యాన్వేషణ
105. మానవుల్లో సోదరభావం
106. శాంతి ఎలా స్థాపితమవుతుంది?
107. పరలోక భావన భారతీయ సాంప్రదాయాలు
108. హజ్రత్ అబూబక్ర్ సిద్దీఖ్ (రజి)
109. హజ్రత్ ఉమర్ ఫారూఖ్-యె-ఆజమ్ (రజి)
110. హజ్రత్ ఉస్మాన్ గని (రజి)
111. హజ్రత్ అలీ (రజి)
112. ప్రవక్త (సఅసం)వారి ప్రాణమిత్రులు
113. అమెరికాలో నవ ముస్లిముల వాస్తవ గాథలు
114. ఇస్లాం అధ్యయనం ఎందుకు చేయాలి?
115. నిన్ను నీవు తెలుసుకో
116. స్వీయ సంస్కరణ
117. బాలశ్రామికులు
118. జమాఅతె ఇస్లామీ హింద్ ప్రాధాన్యతలు
119. దైవదౌత్యం ముగింపు
120. ధర్మపథంలో అవరోధాలు
121. హజ్రత్ ఆయెషా (రజి)
122. ఎడారిపువ్వు
123. మానవులంతా ఒక్కటే
124. మధురమైన మాటలు
125. తూరుపుతావి
126. ఖుర్ఆన్ 24 ఆయత్‌లు-అభ్యంతరాలు, వాస్తవికత
127. ఖుర్ఆన్ అవగాహనం (మొదటి సంపుటం)
128. హజ్ పరమార్థం
129. ఒక మనిషి రెండు వైఖరులు
130. క్యాంపస్ గైడ్ (ఎస్.ఐ.ఓ.)
131. తెలుగు అధికార భాష కావాలంటే ....
132. ఖుర్ఆన్ దైవగ్రంథం
133. దానా హకీం





తెలుగులో ఇస్లామీయ సాహిత్యానికి ప్రముఖ కేంద్రం

**తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్**

సందేశభవనం, లక్కడ్‌కోట్, ఛత్తాబజార్, హైదరాబాద్-500 002.

ఫోన్:24564583 ; ఫ్యాక్స్: 24576237 e-mail: tiphyderabad@rediffmail.com